మఱి చెప్ప కేమి:—

# ఉభయులకు లాభకరము.



చందాదారులార !

పోస్టేజి మనియార్డరుఖర్చులు మేమే భరించి వి. పి. ద్వారా గ్రంథముఁ బంపినయెడల 1 రూపాయిలో పోస్టువారు 0-8-0 తినగా మాకు దక్కెడి 0-8-0 మాత్రమే. ఇది మాకు కిట్టుబడికాదు. మీరే భరింపవలసివచ్చిన, నిష్కారణము దండుగ యగుచున్నదని మీరే కాదు మేముకూడ, దుఃఖింపవలసినదే. అందుచే, ఉభయులకు నష్టములేకుండ ఒకయుపాయము చెప్పచున్నారము వినుండు. ముందు అడ్వాన్సుగా, 1 రూ. మాత్రము, మేము ఇంటిమేషను పంపినవెంటనే, మాకుఁబంపినఁ జాలును. సంవత్సరము చందా ఒక్కమారుగ పంపవలెనను నిర్బంధములేదు. మీ అడ్వాన్సు అందినవెంటనే గ్రంథము అన్‌రిజష్టర్డు పార్సెలుద్వారా, (అందుకయిన పోస్టేజి మేమే భరించి) పంపుదుము. ఇది గ్రహింపక చందాదారులు మాకు నష్టముఁ గూర్చిన ప్రయోజనము లేదు. పోషకులుగాని రాజపోషకులుగాని లేకపోయినను చందాదారుల యభిమానప్రోత్సాహముల బలమున నిల్చి పనిచేయుచున్న మాగ్రంథమాలకుఁ దోడ్పడి యుద్ధరింపవలెను. చాలమంది చందాదారు లీవిధముగ అడ్వాన్సు పంపుచున్నారు. అన్‌రిజష్టర్డు పార్సెలుద్వారా పంపిన గ్రంథము తప్పక అందితీరును.

ప్రతివిషయములో మా యీక్రింది చిరునామా గమనించవలెను.

భాగవతుల నరసింహశర్మ,

ప్రొప్రైటర్, "వేగుఁజుక్క" గ్రంథమాల,

పూతిపెద్దివారివీధి-బరంపురం—(గంజాం)

వేగుఁజుక్క గ్రంథమాల_బరంపురం.(గంజాం.)

# శ్రీ తులసీరామాయణము

## భగవాన్ తులసీదాసుగారి రామాయణము.

**Mahatmaji Writes in young India dated April 27, 1921.**

"The Ramayana used to be regularly read in our family. A Brahmin Called Ladha Maharaj used to read it. He was striken with leprosy, and he was Confident that a regular reading of the Ramayana would cure him of leprosy, and indeed he was cured of it."...........

ఈరామాయణముఁ గూర్చి శ్రీగాంధిమహాత్ముఁడు "యంగ్ ఇండియా" అను పత్రికలో నిట్లు వ్రాసెను:—

"మాయింటఁ బ్రతిదినము నీరామాయణమును లాఢా మహారాజను బ్రాహ్మణుఁడు చదువుచుండెను. అతఁడు కుష్ఠరోగి. ఈరామాయణపఠనమువలనఁ దనరోగము నివర్తించు నని విశ్వసించి పఠించుచుండెను. నిజముగ, అతఁ డారోగమునుండి విముక్తిఁ గాంచెను."......

The Christian Literature Society వారీగ్రంథప్రాశస్త్యమును, "Divine in carnation as taught by Ramayana of Tuḷasi Dass" అను గ్రంథముఖమున వెల్లడించినారు. దీనిప్రాశస్త్యమిట్టిదని మే మింతకంటె నధికముగ వ్రాయఁజాలము. ఈగ్రంథమును పద్యకావ్యముగ నాంధ్రీకరించుచున్నారము. గ్రంథకర్త:—భాగవతుల నృసింహశర్మగారు. సార్థకబిరుదాంకితులగు, దేశోద్ధారక కాశీనాథుని నాగేశ్వరరావుగారి పీఠికతో, మహాకవి తులసీదాసుగారి పటముతో, ఆంధ్రీకరించిన గ్రంథకర్త ఛాయాపటముతో, శ్రీరామపట్టాభిషేక చిత్రపటముతో, మిక్కిలి సొగసుగ ముద్రింపఁ

బడి బాలకాండము + అయోధ్యాకాండము (రెండుభాగములుఁ) గలిపి యొకసంపుటముగా నిండుకేలికో బైండు చేయఁబడుచున్నది. దరిదాపు 3000 పద్యములు. విలువ రూ 2-8-0. మా ఆంధ్రసోదరులు దయయుంచి రూ 1-0-0 అడ్వాన్సుతో సహా ఆర్డరు బుక్ చేసికొనవలెను. కొలదిప్రతులుమాత్రమే కలవు.

☞ బాలకాండము ప్రథమముద్రణము 1000 ప్రతులు సరిపోయినవి. ద్వితీయముద్రణము కొలఁదిప్రతులుమాత్రమే ముద్రింపించి, అయోధ్యాకాండము రెండుభాగములతోఁ గల్పి కొన్ని ప్రతులమాత్రమే నిండుకాలికో బైండు చేయించుచున్నారము. వలయువారు వేగముగా అడ్వాన్సు పంపుకొనవలెను.

భాగవతుల నృసింహశర్మ,
ప్రొప్రైటర్, వేగుఁజుక్క గ్రంథమాల,
పూడి పెద్దివారి వీధి, బరంపురం-(గంజాం జిల్లా.)



# అయోధ్యాకాండము.



## ద్వితీయభాగము.

—: సీత గంగాదేవిఁ బ్రశంసించుట :—

గీ. అట్లు భక్తవర్యుఁడు గుహుం । డరిగినంత
మువ్వురున్ గంగలో స్నాన । ముల నొనర్చి;
రందు రాముండు పూజించె । నతులభక్తి
నెవనిఁ బూజించె? నాతండ । యెఱుఁగుఁగాక 702

గీ. జలజసంచయమధ్యస్థ । జలవిహంగ
కలకలారావములతోడ । నలలతోడఁ
గడల నొఱయుచుఁ బ్రవహించు । గంగఁ జూచి
జానకీదేవి యీరీతి । సన్నుతించె. 703

ఉ. "నీకరుణావిశేషమున, । నిత్యముఁ బావనులై తరింప, ము
ల్లోకములన్ గలట్టి ముని । లున్ జనులున్ నిను సన్నుతింతురి మం
దాకిని వంచు వెండియుఁ బి । నాకినివంచుఁ; బవిత్రమైన నీ
ప్రాకటశక్తి, పాపములఁ । బాపఁగ నోపుఁగదా సురాపగా. 704

గీ. భోగముల కాస్పదం బైన । పురముఁ బాసి
సత్యవాక్పాలనార్థంబు । జంకుఁ దక్క-
కాన కేతెంచితిమి నీదు । కరుణయున్న
గ్లానియున్ హాని లేదు గం । గాభవాని!" 705

చ. అనవుఁడు గంగపల్కెనటు । లయ్యెను తుంగతరంగసంఘని
స్వనమున "శ్రీ రఘూద్వహుని । పత్నివి నీదుప్రభావ మెరికేన్
గనుఁగొన నౌనె? నీకరుణఁ । గాంచినవాఁడు త్రిలోకపూజ్యుఁడే
యనఘుఁడు నీపవిత్రత స । హర్నిశమున్ గొనియాడఁ డాత్మలో. 706

గీ. "సిద్ధులున్ సాధ్యులున్ జిత్త । శుద్ధిఁగలిగి
నిన్ను సేవింతురి సతతంబు । నీమమునను

కరుణదై వాఱ నీవు నన్ । గారవింపఁ
దలఁచి నన్నుఁ గొం డాడెను । ధరణిపుత్త్రి. 707

మ. పతితో లక్ష్మణుతో మునీంద్రవినుత।ప్రఖ్యాతితో సేవ కా
శ్రితసంతానముతో నయోధ్య నెలమిన్ । క్షేమంబుగాఁ జేరదో
క్షితిపుత్త్రి" యనుచున్ వినంబడఁ దదా।శీర్వాదవాక్యంబు లా
సతియాలించెను సుప్రసన్నముఖియై । స్వాంతంబు శాంతింపఁగన్.

ఉ. అంత నిషాధినాథుఁ డగు । న గ్గుహుఁ డచ్చటి కేగుదెంచి శ్రీ
మంతులఁ జూచి మ్రొక్కి యనె । "మార్గముఁ జూపఁగ వచ్చినాఁడ దు
ర్దాంతవనంబునన్ దగిన । తావునఁ గట్టెదఁ బర్ణశాల, మీ
రెంతయు సంతసంబున య।థేచ్ఛఁగ నందు వసింప నొప్పగున్ 709

చ. అన విని రాము డగ్గుహుని।నాదటఁ జూచి హసించి, భక్తికిన్
మనమున సంతసించి, వన।మార్గమునన్ సతితోడఁ దమ్మితో
ననుచరుతోడ నేగె, నమ।రాపగకున్ దుది మ్రొక్కు లిచ్చుచున్
ద్రినయును సంస్మరించుచుఁ ద।దీయసుతున్ వినుతించుచున్ మదిన్.

గీ. వారలా రీతిఁ జనిచని । వారిజాప్తుఁ
డస్తమింపఁగ నొకభూరు।హంబుక్రింద
రాత్రి వేఁగించి ప్రాతరా।రంభవేళ
లేచి నడచి ప్రయాగంబుఁ । జూచి రపుడు. 711

— : ప్రయాగక్షేత్రము : —

సీ. మాధవస్వామి, య।మాత్యవర్యుఁడు గాఁగ
సత్యమే నిత్యంబు । సఖుఁడు గాఁగ
వరచతుర్వర్గంబు । భాండారమై గ్రాలఁ
బుణ్యప్రదేశంబు । భూమిగాఁగ
శ్రద్ధయే భార్యగా । సంతతంబుఁ ద్రివేణి
డంబైన సింహాస।నంబు గాఁగ

వటము ఛత్రము గాగ వరనదీ తుంగత
రంగసంఘము చామరములు గాగ
గీ. సకల తీర్థరాజములు సైనికులు గాఁగ
బాప మనియెడు ప్రతిపక్షబలము నణఁచి
పతితులన్ బావనులఁ జేసి వైభవమున
రాజిలున్ ప్రయాగక్షేత్రరాజ మిలను. 712
సీ. దర్శించినన్ జాలు దారిద్ర్యదుఃఖంబుఁ
దొలఁగించి భక్తుల నలరఁ జేయుఁ
బుణ్యాత్ము లగు సాధువులకు సన్మునులకు
నాస్థానభూమి యై యతిశయించుఁ
బరమార్థముం గోరివచ్చువారికి వనో
వాంఛితంబు లొసంగి ప్రణుతిఁ గాంచు
వేదశాస్త్రపురాణ చోదిత సత్కర్మ
ముల కాలవాలమై మోక్ష మిచ్చు
గీ. గలుష కుంజరమృగరాజ ఘనతఁ బొందు
సుప్రసన్నంబు సుప్రసిద్ధప్రయాగ
తీర్థరాజంబుఁ జూచిన వ్యర్థ మగునె
అనుచు రాముండు బహుభంగులను నుతించె. 713

—: భరద్వాజునివిందు :—

గీ. అంత నాక్షేత్రమున స్నాన మాచరించి
శివునిఁ దీర్థదేవతలఁ బూజించి మ్రొక్కి
రామచంద్రుండు హర్షవారాశిఁ దేలి
క్రమముగా భరద్వాజాశ్రమమును జేరె. 714
ఉ. భూజను లెల్లరుణ్ బొగడఁ బూనిక మైఁ దప మాచరించి, యా
రాజకిరీటుఁబోలి, ముని రాజికి రా జగువాని నాభర

ద్వాజునిఁ జూచి మెచ్చుకొని । పావనుం డంచు నమస్కరించె సం
భోజదళేక్షణుండు రఘు।పుంగవుఁ డెంతయు సంతసంబునన్. 715

గీ. అంత నతఁడు బ్రహ్మానంద । మనుభవించి
కన్నుఁగవమోడ్చి రామునిఁ । గౌఁగిలించి
క్షేమ మగుఁగాక యనుచు నా।శీర్వదించి
అట్టహాసంబుఁ గావించి । యతిశయించి. 716

తే. "అహహా! నాపుణ్యఫలము ప్ర।త్యక్ష మయ్యె
ఘనతదీపింప నాదు యో।గము ఫలించె
ధన్యతంగంటి నేడు మీ।దర్శనమున
రామ! వినుతసుత్రామ! సం।గ్రామభీమ." 717

చం. అనుచు వచించి రం డని ఫ।లాదులఁ గొం డని ముందుఁ బెట్టి యా
సనముల నిచ్చినంత గడు।సంతస మొంది తదాదరంబునన్
దనిసి శ్రమంబు దీర్చుకొని । ధన్యుల మంచు వచించు రామునిన్
గని దరహాసరంజితము।ఖంబున నమ్మునివర్యుఁ డిట్లనున్. 718

సీ. అహహా నేటికి నాదు। యాగంబు యోగంబు
వైరాగ్యము ఫలించె । వనజనయన!
పరమార్థ మనునది । ప్రాప్తించె నేడు నీ
సందర్శనంబున । జనవరేణ్య!
నాకోర్కె లీడేఱె । నానావిధంబులఁ
జరితార్థ మయ్యె నా।జన్మములను
నీపాదకమలముల్ । నిత్యంబు సేవింప
నాసక్తి నిమ్ము నా।కంతె చాలు

గీ. నిన్నుఁ ద్రికరణశుద్ధిగ । నెన్నలేని
వాఁడు కలనైన సుఖియింప।లేఁడు దేవ!

నిన్ను సేవించు భక్తుండు । నిక్కువముగఁ
గార్యసిద్ధినిఁ బొందు శీ । ఘ్రముగ ననఘ! 719

గీ. దానధర్మముల్ జపములు । తపము లేటి
కా ఫలము నేఁడు నాకుఁ బ్రత్యక్షమయ్యెఁ;
బనికిమాలిన స్వామి నీ । పాదధూళిఁ
బొందినన్ బుణ్యసీమ యై । పొలుపుఁగాంచు. 720

చ. అన విని రామచంద్రుఁ డహ । హా యని యమ్మునిఁ గౌఁగిలించి యి
ట్లనియెఁ "గృపామయుండవు మ । హాత్ముఁడ వుత్తమ మైనసత్తపో
ధనము యశోధనంబుఁ గల । తాపసి వీవ సివాని శిష్యుఁడన్
నను వినుతింప నీకుఁ దగు । నా చెప్పుచు మునిలోకసన్నుతా! 721

గీ. అనుచుఁ బ్రణమిల్లి మునివర్యు । నభినుతించి
ఆశ్రమంబుగ నచ్చోట । విశ్రమించి
సూర్యుఁ డుదయించినంతనే । సోదరుండుఁ
దాను సతియు గుహుండు క్షే । త్రమున కరిగి. 722

గీ. తనదు దేహంబుఁ బోలి పా । వనతఁ గన్న
యమునలో రాఘవుఁడు స్నాన । మాచరించి
పలువిధంబుల వినుతించి, । భక్తవరుని
గుహుని దీవించి, పిదప వీ । డ్కొలిపె నెలమి. 723

—: శ్రీరాముని నాటవికులు స్తుతించుట :—

ఉ. "మీరు మహానుభావు లని । వింతగఁ జూచి నమస్కరించు త
త్తీరనివాసులం గని, మ । తిన్ గృపదోఁపగ మాటలాడి కాం
తారనివాసహేతువును । తల్లియనుజ్ఞయుఁ జెప్పి మెల్లఁగన్
వారల వీడుకొల్పి రఘు । వర్యుఁడుఁ బోయె యథేచ్ఛ, నత్తఱిన్. 724

సీ. రాముండు చనిన పు । రగ్రామసీమలు
సురనాగపురముల । సొంపునింపు

శ్రీరామచంద్రు దర్శించిన పామరుల్
దేవత లట్లు వర్ధిల్లు ఘనులు
వనజాక్షుండు మునుంగు । వరజలాశయములు
మహితమందాకినీ।మానసములు
విష్ణుమూర్తి యితండు । విశ్రమించినమ్రాను
కామితంబు లొసంగు । కల్పతరువు
గీ. పలుపలుకు లేల నీదివ్య।పాదధూళి
సోకినస్థలంబు వైకుంఠ।లోక మగును
అనుచుఁ బరిపరివిధముల । నచటిజనులు
పలుకఁ జొచ్చిరి తమపుణ్య।ఫలము కొలఁద. 725

—: సీతారామలక్ష్మణుల వనప్రయాణము :—

చ. తనదు వినీలకాంతి కొక।త క్కఁగ రొత్తఁగఁ జేయఁజాలు నీ
తనితనువోర్వవచ్చునె ని। దాఘమునంచుఁ దలంచి మేఘుఁ డ
య్యినునకు నడ్డమై రఘుకు।లేంద్రునిత్రోవను శీతలంబుగా
నొనరిచినంతనే సుమము। లొత్తుగఁ జల్లిరి వేల్పు లర్థిజిన్. 726
మ. నగముల్ దాటుచుఁ దచ్ఛిరస్థఘనశిఖిధ్వానంబు లాలించుచున్
మృగసందోహముఁ దద్విలాసగతులన్ । వీక్షించుచున్ మ్రాఁకు
లన్ ఖగసంతానముఁ జూచి లోనలరుచున్ । గష్టంబు గన్పట్టకుం
డగ భాషించుచు ముగ్వురుం జనిరి కాం।తారప్రదేశంబునన్. 727
సీ. ఎండనోర్వఁగ నౌనె? । యీతరుచ్ఛాయల
మీర లించుకవిశ్ర। మింపరాదె?
సుకుమారు లక్కటా । సొక్కిపోలేద రివే
పల్లవశయ్యలన్ । బండరాదె?
లేఁబ్రాయమున నిట్టి । క్లేశ మేటికి? నివే
మృదుఫలంబులఁ గొన్ని । మెసఁగరాదె?

ఒడలు చెమ్మటఁ గ్రక్క । బడలె, నీశీతలో
దకముల దని వోవఁ । ద్రావరాదె ?

గీ. ఇట్లు గ్రామీణు లాబాల। వృద్ధజనులు
స్నిగ్ధనయనంబులన్ వారి । చెలువుఁ గాంచి
యాదరించినయంత నే । మోద మొంది
అచట నుపవిష్టు లైయుండి । రతిథు లగుచు. 728

చ. జనసుత రామచంద్రముఖ। చంద్రచకోరకు లై రహించి వా
రనిమిషదృష్టి స్త్రీపురుషు । లందఱుఁ జుట్టును మూఁగి రామునిన్
ఘనునితమాలనీలసమ। కాయునిఁ జూచి యతృప్తనేత్రులై
మునులుఁ దదీయభార్యలుఁ బ్ర। మోదముఁ బొంది రనేకభంగులన్.

గీ. కటితటంబున ఖడ్గంబుఁ । గరమునందుఁ
జాపమున్ వెన్క నక్షయ । శరధిఁ గలిగి
వల్కలముఁ గట్టి, బంగారు । పసిమి మించు
ననఘు లక్ష్మణు వీక్షించి । రాకుణాంబ. 730

గీ. వరజటాజూటముకుటంబు । శిరమునందుఁ
గలిగి పీనవిశాల వ । క్షంబుఁ గలిగ
ఉరుభుజంబుల శోభిల్లు । సరసిజాక్షు
సరణివీక్షించి పొగడి రా। జానపదులు. 731

చ. శరదమృతాంశు బింబసదృశం బయి రాజిలు మోమునందు సుం
దరదరహాసచంద్రికలు । తాండవ మాడఁగ, ఘర్మబిందువుల్
పరమపవిత్రశాంతరస। వార్ధికణంబులు నారహింపఁగన్
హరు డో నరుండో రాముఁ డర। యన్ దరమా యొకమందబుద్ధికిన్

గీ. స్త్రీలుఁ బురుషులు, మృగములు । దీపకాంతిఁ
జూచుగతిఁ జేష్టలందక్క । చూచుచుండి)

శ్రీలుగొందఱు ప్రశ్నింప । సీతఁ దవిసి
యతుగఁ దలఁచియు జంకుచు । నరయుచుండి. 733

— మునివనితలు సీతఁ బ్రశ్నించుట —

ఉ. అంతట సాహసించి వినయంబుగఁ గొందఱు ప్రౌఢకాంత లే
కాంత మటంచు సీతసము । ఖంబునకుం జని "రాజపుత్రి ! మా
స్వాంతములన్ క్షమింపుమొక । సంశయ మున్నది; యన్యభావ మొ
క్కింతయుఁ బొందకుండ వచి । యింపుము మానుడి యాలకింపుమా.

చ. మరకతరత్నకాంచనస । మానులు, శ్యామలగౌరవర్ణులున్
శరదమృతాంశుబింబసదృ । శంబులు వీరిముఖంబులున్, శర
త్సరసిజనేత్రులున్ స్మరుని । తండ్రులు రాజకుమారసింహు లీ
యిరువురు నీకు నేమగుదు । రేర్పడఁ జెప్పుము మానినీమణీ! 735

ఉ. నావుడు సీత వారివచ । నంబులకున్ బదులాడ లేక ల
జ్జావనతాననాంబురుహ । యై భువిఁజూచుచు నిల్చి "యుత్తరం
బేవిధి నిచ్చుదాన? నిపు । డెమ్మెయి నేన్ వచియింపకున్న సం
భావనకుం గొఱంతయగు; । మౌనముఁబూనిన మిన్నకుందురే?

చ. అని ద్వివిధంబులం దలఁచి । యా సతి యిట్లనె, "నన్నదమ్ము లీ
యనఘులు; గౌరవర్ణుఁ డగు । నాతఁడు నాకు మఱంది యౌ, నిదే
వినుఁ"డని ప్రాణనాథు రఘు । వీరవరేణ్యు నపాంగదృక్కులన్
గని దరహాసమండితము । ఖంబున వంచె నొకింతసిగ్గునన్. 737

చ. అనవుడు వార లెల్ల జన । కాత్మజఁగాంచి నమస్కరించి యి
ట్లని రతిభక్తి తోడ విన । యంబును జూపుచు, "శేషుఁ డీధరి
త్రిని ధరియించునందనుక । దీర్ఘసుమంగళివై రహింతువా
త్రినయనుభార్యకైవడిఁ బ । తివ్రత వై పతిప్రేమపాత్రవై. 738

గీ. మగిడి యీమార్గమునవచ్చి । మమ్ముఁ జూడ
నయముఁ గణించి యని వారు । పలికినంత

నలరి యలరించె నిజమంద। హాసమునను
గైరవంబులఁ గౌముది। కరణిదోప. 739

— మునికాంతల పరితాపము —

గీ. జనకపుత్త్రితో రామల। క్ష్మణులు గహన
వీధిఁగల మార్గముంబట్టి। వెడలువేళ
వెనుకఁ దమహృదయంబులు। వెంబడింప
నాత్మగతమున దుఃఖించి। రచటిజనులు. 740

గీ. "బ్రహ్మ వనియందుఁ గాని, ని। రంకుశుఁడవు
నిష్ఠురుఁడవు నిర్భయుఁడవు। నిర్దయుఁడవు
అఖిలవిపరీతముల కీవ। యాస్పదుఁడవు
ధాత! నిన్ను నిందించినఁ। దప్పు లేదు. 741

సీ. అమృతాంశుఁ డని చెప్పి। కుముదబాంధవునందు
ఘోరరోగముఁ బాదు। కొల్పి తీవు
అఖిలయాచకకోటి। యర్థించునది యిచ్చు
చింతామణిన్ శిలన్। జేసి తీవు
జలరాశు లివియని। సాగరంబులయందుఁ
గటకటా క్షారంబుఁ। గలిపి తీవు
బహుసుందరం బయ్యుఁ। బాలాశకుసుమంబు
వాసనలేకుండఁ। జేసి తీవు

గీ. అనఘు లగు రాజపుత్త్రుల। నడవిఁ జేర్చి
శ్రీలభోగంబులన్ వృథఁ। జేసితీవు
ధర్మపరు లైనరాజనం। దనులు వీర
లేలకుండిన సామ్రాజ్య। మేల చెపుము. 742

సీ. అడవులలో వీరు। నడయాడుచుండిన
నాందోళికాది వా। హనము లేల?

స్థండిలస్థలి వీరు । దర్భశయ్యలనుండ
లలివిూఱు మృదుల తల్పంబు లేల?
పర్ణశాలను వీరు । వాసింపవలసిన
నంబరచుంబి హ । ర్మ్యంబు లేల?
భళిర వీరలు జటా । వల్కలధరులైన
రాణించు వస్త్రాభ । రణము లేల?

గీ. ఆకులలములు వీరి కా । హారమైన
నమృతతుల్యమృష్టాన్న భో । జ్యంబు లేల?
విపుల నగ్నిహోత్రంబున । వేల్చినట్లు
భయదగహనంబునకు వీరిఁ । బంపదగునె? 743

గీ. రామచంద్రుండు బ్రహ్మనిర్మాణమునకుఁ
జెందక, స్వయంబుగ జనించె । సృష్టియందుఁ
గాకయున్న నీరేఖజ । గంబులందు
నిట్టిసుందరుఁ డెందైనఁ । బుట్టకున్నె? 744

గీ. ఇట్టి సుకుమారు సృజియింప । నెంచి తుదకుఁ
దత్ప్రియత్నంబు విడిచి, మా । త్సర్యమూని
దాశరథి నిట్టు లడవిలో । దాఁపఁదలఁచె
జతురుఁడే చతుర్ముఖుఁ డార । జకుఁడుగాక. 745

గీ. ఎంతటి తపంబుఁజేసి యీ । సృష్టియందుఁ
బుట్టితిమొ నేడు శ్రీరామ । మూర్తిఁ జూచి
జన్మసాఫల్యముం బొందఁ । జాలినాము
మన పురాకృతసత్కర్మ । మహిమవలన. 746

గీ. అనుచు నీరీతిఁగొంద ఱయ్యవసరమున
జానకిన్ రామచంద్రు లక్ష్మణునిఁజూచి

పరిపరివిధంబులన్ జింతఁ । బరితపించి
రెంతదుఃఖించిరో వారి । కాంత లపుడు. 747

ఉ. వేలుపుఁ బెద్దవో నలువ! । వీరలు దుర్గమవీధిఁ బోవఁ బ్రా
ల్మాలిక మిన్నకుంటివో? సు । మంబులశయ్య సృజింపకుండ; ధ
ర్మాలయు లైన వీరల ప । దాబ్జపవిత్రరజంబు సోఁకినన్
రాలయునన్ సుమంబులయి । రాజిలునంచు మదిన్ దలంచితో.

గీ. అనుచునీరీతిఁ గొందఱు । వనజముఖులు
వారలంజూచి పలికిరి । పరితపించి;
సాంధ్యసమయంబునన్ సూర్య । చంద్ర మరసి
శోకులంగూయు చక్రవా । కుల విధాన. 749

గీ స్త్రీలు బాలురు యువకులు । వృద్ధజనులు
స్నేహవాత్సల్యమునను వీ । క్షించుచుండ్రి
పలుపలుకు లేల శ్రీరాము । వనమునందుఁ
గాంచి యాదరింపనివారు । గానరారు. 750

గీ. అగ్రగామియై శ్రీరాముఁ । డరుగుచుండ
వెనుక సౌమిత్రి వినతుఁడై । యనుగమించె
మాయ, పరమాత్మ జీవాత్మ । మధ్యమునను
వఱలుకైవడి సీత గ । న్పట్టె నపుడు. 751

ఉ. కంతువసంతమధ్యమునఁ । గన్గొనఁ గ్రాలెడు కమ్మవిల్తు సీ
మంతినిఁ బోలి, చంద్రబుధ । మధ్యమునన్ రహించు రోహిణీ
కాంతనుబోలి, కాననమృగంబులు నచ్చెరు వొంద, శోభిలన్
పంతుగ రామలక్ష్మణుల । మధ్యమునన్ భువిపుత్త్రి యత్తఱిన్.

చ. సరసిజనేత్రుపాదజల । జంబుల చిన్నెలఁబట్టి సీత, యా
యిరువురి పాదచిహ్నముల । దృష్టి నిగుడ్చుచు లక్ష్మణుండు, న

య్యురుగమానంబునన్ వెసలు । చుండిరి, వారలశోభఁగాంచి భీ
కరమృగపన్నగంబులు ఖగంబులుఁ బొందెఁ బ్రసన్నభావమున్.

గీ. సర్వజనమనోహారి । సజ్జనవిహారి
బాటసారియై రాముండు । బయలువెడలె
నతనిఁ జూచిన జీవి సం । సృతివనంబు
దాటి సుఖియింపకుండునే । తక్షణంబ. 754

గీ. నడువఁజాలక జానకి । బడలినంత
వృక్షశీతలచ్ఛాయల । విశ్రమించి
శీతలోదకములఁ ద్రావి । సేదదేఱి
నడుచుచుండిరి ఘోరవ । నంబునందు. 755

గీ. సుందరవనంబునంగల । కందమూల
ఫలములం దిని పర్వత । ములను దాటి
సీతతో రామలక్ష్మణుల్ । చేరిరప్పు
డశ్రమముగ వాల్మీకిము । న్యాశ్రమంబు. 756

— వాల్మీకి మున్యాశ్రమము. —

సీ. ఫలపుష్పసముదాయ । భారావనతములై
కడుసొంపునింపు వృ । క్షములతోడ
విమలాంబుసంభూత । కమలకైరవగంధ
వాసితతతసరో । వరములతోడ
నరవిందమకరంద । మాస్వాదించిమదించి
రొదలతో మెదలు తు । మ్మెదలతోడ
వృక్షశాఖాగ్రస్థ । పికశుకశారికా
కలకలారావ సం । కులములతోడ

గీ. సహజవైరంబులం బాసి । సంతసమున
సంచరించెడు సత్త్వ సం । చయముతోడ

నతుల శాంతిని కేతన । మనఁదనర్చు
నాశ్రమముఁ గాంచి శ్రీరాముఁ । డలరె నెలమి. 757

ఉ. ఆ మునివల్లభుండు, తన । యాశ్రమసీమకు సీతతోడ శ్రీ
రాముఁడు వచ్చినంత, "భళి । రా సుకృతంబు ఫలించె, మోక్షల
క్ష్మీమహిమాభిరాముఁ బరి । కించి కృతార్థుఁడనైతి, మానవుం
డై మహిఁబుట్టినట్టి జల । జాక్షుని దర్శన మబ్బె నేటికిన్." 758

గీ. అనుచు నుప్పొంగి నిజశిష్య । జనముతోడ
నెదురుగావచ్చి యాతిథ్య । మిచ్చి మెచ్చె
రామచంద్రుండు దండప్ర । ణామములను
జేసి, యాతిథ్యమొందె యా । సీనుఁ డగుచు. 759

—: శ్రీరాముఁడు వాల్మీకితోఁ బ్రసంగించుట :—

చం. కరములమోడ్చి మ్రొక్కి, "ముని । కాంత! మహాత్మ! త్రికాలవేది వీ
వరయని కీజగత్త్రయము । నందుఁ గనుంగొనరాదు బ్రహ్మకేన్;
గరబదరాయమాణము జ । గంబఖిలంబును నీకు, నేటి నా
చరితము జ్ఞానదృష్టిఁ గనఁ । జాలుదు వింకవచింప నేటికిన్. 760

గీ. మాతృహితమును గాంక్షించి । మాన్యుఁడైన
తండ్రిఋణమును దీర్చ, సోదరు నకఖిల
రాజ్యము నొసంగి, యిట్టు ల । రణ్యసీమఁ
జేరికొంటిని మునిపాద । సేవఁగోరి. 761

గీ. ధన్యుఁడన్ నీదు చరణస । దర్శనమునఁ
బావనుఁడనైతి నాపుణ్య । ఫలము కొలఁది
హాయిగా మాను లెచ్చోట । నలరుమందు
రచట నివసింతు వంత యా । వంత లేక. 762

గీ. సాధువులు సన్మునీంద్రులు । సజ్జనులును
ఖిన్నులై సంకటముల దుః । ఖించుచుండ

నక్కటా వారికష్టంబు । నరయఁ డేని
భస్మమగుఁగాక భూపుండు । బ్రదుకఁగలఁడె? 763

గీ. బహుళదారిద్ర్యము సహించు । బ్రాహ్మణుండు
వాని యామోదమే ప్రభు । వంశమునకు
మంగళంబగు; బ్రాహ్మణా । మర్షవహ్ని
భస్మముం జేయుఁ బ్రభువుల । వంశములను. 764

చ. మునితిలకా! కుటీరమున । ముద్వరముగ్ నివసించువార మి
వ్వనమున నుండగాఁ దగిన । పట్టెఁ జెఁగింపుము, చింతదక్కి సె
మ్మనమున సత్తపోధనుల । మానుల, జ్ఞానులఁ గొల్చి వారి దీ
వనలఁ బరిగ్రహించి యన । పాయముగన్ సుఖయింతు మొక్కచో.

— వాల్మీకి శ్రీరాముఁ బ్రస్తుతించుట. —

చం. అనవుఁడు జ్ఞానదృష్టిఁగల । యమ్మునివర్యుఁడు, రాము, లోకపా
వనుఁ బరికించి తత్సరళ । వాక్కుల మెల్లగ నాలకించి యి
ట్లనె, "రఘురామ! ధన్యుఁడ న । నంతుఁడ వాద్యుఁడ వేనెఱుంగనే?
ఇనకులమందుఁ బుట్టె జగ । దీశ్వరుఁ డివ్విధి మానవాకృతిన్. 766

గీ. వేదమర్యాదఁ బాలింప । విబుధవరుల
కీడు బాపంగ వచ్చిన । వాఁడ వీవు
అహహా! యూసీత, మాయ, ని । న్ననుసరించెఁ
బుండరీకాక్ష! త్రిగుణాత్మ । కుండ వీవు. 767

గీ. అఖిలలోక ధూర్వహుఁ డంచు । ఖ్యాతిఁ గొన్న
ఆదిశేషుండు లక్ష్మణుం । డంబుజాక్ష!
ధర్మసంస్థాపనార్థంబు । ధరణి నిట్టు
లవతరించిన నిన్ను నే । మని నుతింతు. 768

ఉ. ఈజగతీతలంబు నశి । యింపఁగ లోకుల మోసపుచ్చగన్
రాజశేఖరధారియగు । రాక్షసుఁగన్ వధియింపనెంచి యం

భోజహితాన్వయంబునను । బుట్టిన యాపురుషోత్తముండ వం
భోజదళేక్షణా! సుగుణ।భూషణ యాశ్రిత భక్తపోషణా. 769

గీ. నీస్వరూపంబు తత్త్వంబు । నిర్వచింపఁ
గూడునే? యవాఙ్మనస । గోచరుఁడవు
ఖ్యాతిఁగల నిన్ను వేదముల్ । "నేతి" "నేతి"
యనుచు ఘోషించు నని యందు । రార్యవరులు. 770

ఉ. అక్షయమైన నీమహిమ । నారయశక్యమె, యేరికైన? ఫా
లాక్షునినైన నయ్యజుని । నైన భ్రమింపఁగఁ జేయఁజాలు ద
బ్జేక్షణ! యైంద్రజాలికుఁడ । వేమని నిన్ను నుతించెదన్ జగ
త్సాక్షివి, నీకటాక్షమున । ధన్యుఁడనైతి మునీంద్రకోటిలో. 771

సీ. భవదీయ కరుణార।సవిశేషమునఁ గ్రాలు
భక్తవర్యుండు నిన్ । బలుకఁజాలు
నాద్యంత రహితుఁడ । వవికారుఁడవు, సర్వ
జగతిని వెలుఁగు తే।జస్వి వీవు
గోభూమి సురసాధు।కోటినిఁ గాపాడ
మానుషాకృతిఁ గొన్న । మా విభుఁడవు
ప్రాకృత రాజన్యు । వలెఁ బల్కుటయ కాక
కర్మంబులం జేయఁ । గడఁగి తీవు

గీ. మనుజపతివె? చిదానంద । మయుఁడ వగుదు
నీదుచరితంబుఁ గాంచిన । నీమమునను
జదివినన్ విన్న మూర్ఖుండు । జ్ఞానియగును
అతులచిన్మూర్తి! సత్యమా।ర్గానువర్తి. 772

గీ. నిత్యుఁడవు, సత్యమూర్తివి । సత్యమునకు
సంపదలఁ బాసి తామాట । సత్యమగును

తనకు ననుకూలముగఁ దాను । ధరణి మనుట
యుక్త మగుఁగాదె; యాశ్రిత । భక్తవరద! 773

గీ. నీవు నివసించుటకుఁ దావు । నీకెఱుంగ
జేయఁదగుదునె? నీవు వ।సింపలేని
తావు లేదెందునైన నీ । తావొకింత
యెఱుఁగఁజెప్పెద నేర్పుమై । నెఱిఁగినంత. 774

గీ. శ్రవణపుటముల భవదీయ । సచ్చరిత్ర
సుధను గ్రోలుచు నెవ్వాఁడు । సౌఖ్యసోలు
వానిహృదయంబు నీదు ని।వాససీమ
సద్గుణస్తోమ శ్రీరామ । సమరభీమ. 775

గీ. ఎవని దృగ్చాతకద్వయం । బెపుడు నీదు
దర్శనాపేక్ష యనుతృష్ణఁ । దల్లడిల్లు
నపుడు నీదర్శనంబను । నంబుధరము
అభిమతం బిచ్చు నీరద । శ్యామలాంగ. 776

గీ. ఇతర దేవతారాధన । మతిఁదొలఁగి
ఎవఁడు నీదివ్యరూపంబు । నెదఁదలంచి
సంతతము నీదునామంబు । సంస్మరించు
వానిహృదయంబు నీకు ని।వాసమగును. 7 7

గీ. అఖిల సుగుణముక్తాన్వితం । బైననీదు
సద్యశోమానసంబున । సంతతంబు
నెవని జిహ్వామరాళి ర।మించు, వాని
మానసము నీకుఁ బ్రియమైన । మందిరంబు. 778

సీ. భవదీయసుమసౌర।భంబు లాఘ్రాణించి;
కోరి నీకై వేద్య । మారగించి!

భవదర్పితము లైన । వస్త్రాదులధరించి,
నీసుభక్తులనెల్ల । నాదరించి,
గోభూమిదేవతా । గురువులకున్ మ్రొక్కి
చేతులన్ నీపాద । సేవఁజేసి
బహువిధ హోమతర్పణములఁ గావించి
శ్రద్ధతో దానధర్మము లొనర్చి
గీ. ధరణిఁగల నీదు పుణ్యతీర్థముల మెలఁగి,
సతము నీనామమంత్రరాజము జపించి
భూతదయఁగల్గి యేపుణ్య । పురుషుఁ డలరు
వానిహృదయంబు నీదివ్య । భవన మనఘ. 779

మ. అరిషడ్వర్గము సంహరించి, యతిహేయం బైన ద్వేషంబు దు
స్తరరాగంబు నహంకృతిన్ గపటమున్ । జాంచల్యమున్ బాసి, భీ
కరమాయావరణంబు దాటి, సుఖదుఃఖంబుల్ విచారింప కె
ద్దర నెవ్వాఁడు మెలంగు వానిహృది నీ । తావై రహింతున్ గదా.

కం. భూషించిన దూషించిన
ద్వేషించినఁ బరునియెడల । వికటించక లో
నోషింపక సఖ్యంబుగ
భాషించెడు వానిమనము । భవనము నీకున్. 781

గీ. నిద్రితుం డయ్యు లేకయు । నిద్రుఁడయ్యు
నిన్ను నిత్యంబు మతిని ధ్యానించుకొనుచు
సత్యముఁ బ్రియంబు వచియించు । సాధుజనుని
డెందమే నీచిదానంద । మందిరంబు. 782

సీ. తను వశాశ్వత మంచుఁ । దనపుత్రియత్నముఁదక్కి
శరణ మీవని యన్యశరణ మ్ముడిగి

పరసతిన్ దల్లిగా । భావించి యన్యుల
విత్తంబు విషమంచు । విశ్వసించి
సతతంబు నన్యుల । సంతసింపఁగఁ జేసి
యార్తులఁ గాపాడు । నను వెఱంగి
నీతికి ఖ్యాతికి । నిపుణుఁడై వర్తించి
తన కున్నలోపంబు । లను గ్రహించి

గీ. అన్యులంగల సుగుణంబు । లరసి పొగడి
జాతి ధనధర్మగౌర వ। ఖ్యాతులందు
ఆస్థ విడనాడి తుదకు ని । న్నాశ్రయించు
వానిచిత్తంబు నీకు ని। వాస మగును. 783

గీ. స్వర్గ నరక మోక్షంబులు । సమము లనుచుఁ
ద్రికరణంబుగ నిన్ను స్మ।రించి నీదు
పాదదాసుఁడై, యైహిక । వాంఛ విడుచు
వానిమది నీకు వైకుంఠ । భవన మగును. 784

ఆ. వె. ధర్మ మెచటనుండు । దైవ మచ్చటనుండు
దైవమనఁగ నేమి? । నీవ కాక
ధర్మ కర్మనిరతు । ధర్మంబుఁ గాపాడ
నవతరించినాడ । వంబుజాక్ష. 785

శా. తెన్నుందప్పి యధర్మకర్మవశమై । దేశంబుఁ గాపాడఁగన్
నిన్నుక్షమించిన వేల్పెవండు? తుదకున్ । నీవే శరణ్యంబ వా
పన్నానీకశరణ్యా! దుర్జనతతిన్ । బాధించి సాధించి నే
నున్నా నంచు నెఱుంగఁజేయఁదగదే । యుర్వీజనశ్రేణికిన్. 786

గీ. అనుచు బహుభంగుల నుతించి । య మ్మునీంద్రుఁ
డంబుజాక్షుని వీక్షించి । యనియె మఱియుఁ

చిత్రకూటంబు స న్మునిశ్రేష్ఠకూట
మచట నివసింపదగు నీకు ననవరతము. 787

— వాల్మీకి చిత్రకూటవర్ణనము. —

చ. కరులు హరుల్ మృగంబులు ఖగంబులు భీకరపన్నగంబులున్
పరులకు నెట్టి హానియును వాటిలకుండ మెలంగు, నచ్చటన్
స్థిరముగ స న్మునీంద్రులు వసించి పరంబునకై తపించుచుం
దురు, పరికింప నొప్పు భవదోషకవాటముఁ జిత్రకూటమున్.

క. భీకరపాతకపోతక
ఢాకినియై సొంపుఁ బెంపు తవణిల్లగ మం
దాకిని యను నది యనసూ
యాకరుణారస మనంగ నచట రహించున్. 789

గీ. పూర్వ మనసూయ యి న్నదిన్ భూధ్రమునకుఁ
దన తపోబలంబునఁ దెచ్చి ఘనతఁగాంచె
నచట యోగులు మునులు మహర్షివరులు
సంతతముఁ జేయుచుందురు జపముఁ దపము. 790

ఉ. వాటముదీరి పుష్పతరు వాటమునన్ రహియించి, యెట్టి జం
జాటము లేని సాధుమృగ ఝూటముఁగల్గి మునీంద్రకోటికిన్
కూటము, లక్ష్మికిన్ గొలువుకూటము నానుతిఁగొన్న స న్మణీ
జూటముఁ జిత్రకూటమును జూడుము నీకు నివాస మేర్పడన్. 791

గీ. అనుచు నీరీతిఁ జిత్రకూటాద్రిఁ గూర్చి
య మ్మునీంద్రుండు వచియింప నాత్మనలరి
అతని వీడ్కొని, శ్రీరాముఁ డాక్షణంబ
వెడలెఁ దమ్ముండు సీతయు వెంబడింప. 792

మ. అనపాయం బని రాఘవుండు మునివర్యప్రోక్తమార్గంబునన్
జని, మందాకినిఁజూచి యందు నెలమిన్ స్నానంబుఁగావించి, త

మ్మునితో నిట్లనియెన్, వసింప స్థలమున్ । మున్మున్న వీక్షింపుమ
న్న, నదీమార్గముఁబట్టి యాతఁ డరిగెన్ । నల్దిక్కులన్ జూచుచున్.

— । లక్ష్మణుఁడు చిత్రకూటమును సందర్శించుట । —

గీ. అట్లు చనిచని యంత రా । మానుజుండు
త న్నదీకుల్య ధనువు వి । ధాన నొప్ప
దాని వీక్షించి యొంతయుఁ । దనివిదీఱఁ
జిత్రకూటాద్రిఁగాంచి । హర్షించె మదిని. 794

మ. "అదిరా చిత్రము చిత్రకూటకుధర । వ్యాధుండు, మందాకినీ
నదియన్ నారిఁ దదీయకుల్య యనువిం । టన్ గూర్చి జృంభించి స
త్యదయాశౌచమహాతపశ్శమదమా । స్త్రశ్రేణి సంధించి దు
ర్మదపాపోగ్రమృగంబులన్ దునుము న । శ్రాంతంబు మోదార్థియై."

గీ. అనుచుఁ బరిపరివిధముల । నద్రివర్యు
ఘనత వినుతించి లక్ష్మణుం । డనుపమాన
మోదజలనిధిఁ దేలుచు । మునుఁగుచుండ
నచటి కేతెంచె రాముఁ డ । య్యవసరమున. 796

గీ. అమరులెల్లరు దేవేంద్రు । ననుసరించి
సత్వరముగఁ గిరాతవే । షములఁ దాల్చి
ప్రీతిమెయిఁ బర్ణశాల ని । ర్మించినంత
మేలుమే లని రాముండు । మెచ్చుకొనియె. 797

మ. రతితో స్నేహితుఁ డైన మాధవునితో । రాజిల్లు పంచాస్త్రు ను
న్నతి భార్యానుజసేవితుం డగు రమా । నాథున్ విలోకించి దే
వతులున్ సిద్ధులుసాధ్యులుఁ గుసుమములన్ । వర్షించి "యో స్వామి యే
గతి మమ్మున్ గృపనుద్ధరించెదవొ మా । కష్టంబు గట్టెక్కఁగన్.

గీ. మే మనాథుల మయ్యు శ్రీ । రామ నీదు
కరుణచే సనాథుల మైతి । మరయ మయ్య

అనుచుఁ బరిపరివిధముల । నభినుతించి
సెలవుఁ గైకొని యేగిరి । నెలవులకును. 799

గీ. అంతట మునీంద్రు లచ్చోటి । కరుగుదెంచి
శ్రీరఘూద్వహుఁ గాంచి యా। శీర్వదించి
తమకుఁగల కష్టములఁ జెప్పి । దయఁదలంపు
మనుచు వెడలిరి శ్రీరాము । డభయ మొసఁగ. 800

ఉ. రామునిఁజూచి కొందఱు కి। రాతులు పెన్నిధిఁగన్న పేదలై
మోముల నుందహాసములు । మోదమునన్ దళుకొత్త భక్తిమై
వేమఱు సన్నుతించి యర। విందదళేక్షణయుంచుఁగాన్కగాఁ
గోమలపత్రపుష్పసుమ । కోటుల నిచ్చి భజించి రయ్యెడన్. 801

చ. తనయుల ముద్దుపల్కులకుఁ । దండ్రియుఁదల్లియు సంతసించుచా
డ్పునను కిరాతు లయ్యెడఁ గ । డుంగడు భక్తివచించుపల్కులన్
విని నిగమాంతవేద్యుఁడగు । నీరజనేత్రుఁడు రాఘవుండు, న
జ్జనకతనూజయున్ మిగుల । సంతసమొంది రనేకభంగులన్. 802

గీ. గోవులన్ భూమిదేవులన్ । దేవతలను
ఘనుల మునులను గాపాడఁ । గాఁ దలంచి
దాశరథి సీతతోడ సో। దరునితోడ
నచట నివసించియుండె సౌ। ఖ్యంబుదోఁప. 803

గీ. ఇంద్రుఁడు శచీజయంతుల । నెలమిఁగూడి
స్వర్గలోకంబున వసించు । చందమునను
పర్ణశాలను తమ్ముని । భార్యఁగూడి
సౌఖ్యముగనుండె శ్రీరామ । చంద్రుఁ డపుడు. 804

చ. కనులను రెప్పలట్టులఁ ద్రి। కాలములన్ రఘురామచంద్రుఁ డ
య్యనుజుని సీత నొక్కవిధ । మారయుచుండె; శరీరసేవయే

ఘన వసియించు సజ్జుల ప్ర।కారము రాముని లక్ష్మణుండు న
జ్జనకతనూజయున్ గొలిచి । సంతసమొందుచు నుండి రయ్యెడన్.

గీ. సాధుమృగములు ఖగములు । బాధ లేక
సంతసంబున సతతంబు । సంచరించె
మునుల జపతపంబులు హెచ్చె । ననుదినంబు
వనజనయనుండు నివసింప । వనమునందు. 806

—: సుమంత్రుఁడు దుఃఖించుచుఁ బురికేగుట. :—

గీ. అర్కకులవర్యు నెడఁబాసి । యగ్గుహుండు
మరలివచ్చుచుఁ దోవ సు । మంత్రుఁ గాంచి
అతివిషాదమనస్కుఁడై । యాత్మయందు
మిక్కిలి తపించి దుఃఖించె । వెక్కివెక్కి. 807

గీ. అంతట సుమంత్రుఁ డగ్గుహు । నాదరించి
అంతయున్ విని హా రామ! । యఘువిరామ!
జానకీ! లక్ష్మణా! యంచు । జ్ఞానహీన
శిశువుగతి నేడ్చెఁ గన్నులు । చెమ్మగిల్ల. 808

చ. తెలతెలబోయి, దక్షిణపు । దిక్కునకున్ దమ మోర లెత్తి క
న్గొలుకుల బాష్పముల్ దొలఁగఁ । గుందుచు, రామునిఁ జూడనట్టి వ్యా
కులమున నీరముం గసవు । గ్రోలక మేయక సంచరించె ద
క్కలు తెగిబడ్డపక్షులను । కైవడి స్వస్థతఁ దప్పి రథ్యముల్. 809

మ. అతిదుఃఖంబు సహింప కేడ్చెదవు కా । ర్యంబున్నదే చెప్పుమా
ప్రతికూలుండు విరించనుండు, పరమా । ర్థజ్ఞాని వ్రాహింపఁగన్
మతిమంతుండవు మంత్రివర్యుఁడవు సా । మాన్యుండవే, నెమ్మదిన్
ధృతిబూనందగు"నంచు నగ్గుహుఁడు మం । త్రిన్ జేరి యోదార్చుచున్.

గీ. రథమునకు రథ్యములఁ బూన్చి । రమ్మ్మ రమ్మ్మ
శోక మేటికి ననుచుఁ గూర్చుండఁ బెట్టి

శిథిలహృదయుఁడై యాతండు । చేష్టలుడిఁగి
ప్రశమచందాననుండె దిగ్భ్రమముఁబొంది. 811

గీ. రాముని నియోగమునను తురంగములు
మణివిహీన సర్పంబుల । మాడ్కి నొప్పెఁ
బ్రీతి నతనినామము నుచ్చ । రించునట్లు
శిరము లల్లాడ సతము హే । షించుచుండె. 812

గీ. వానిఁబరికించి హయముల । వరుసఁజూచి
అంతట నిషాదుఁడు విషాద । మతిశయింపఁ
బరితపించుచుఁ దనదు సే । వకులఁ బిల్చి
అతనికి దోడుగాఁ బంపె । నాక్షణంబ. 813

గీ. ఆ సుమంత్రుఁ డయోధ్యకు । నరుగువేళ
శోకసంతప్తుఁడగుచు "సుశ్లోకుఁడైన
రాముని వియోగమున నాదు । బ్రదుకు వ్యర్థ"
మనుచుఁ జింతించి బాష్పతో । యములు విడిచె. 814

ఉ. "పాపశరీరమా! సుగుణ । భద్రుని రాముని బాసి నిల్వ నె
ట్లోపితి విట్టి దుర్యశము । నొందుటకంటె నశింపరాదె,? యి
య్యాపదకోర్చితే హృదయ । మా! రఘురామవియోగఘోరసం
తాపశతఘ్నికాహతికిఁ । దాళితి వెంతటి మొండిదానవే?" 815

ఉ. చనె నిట్లాతఁడు రామునిందలఁచి ప । శ్చాత్తాపసంతప్తుఁడై
అనికిన్ వీరవరేణ్యుఁ డాయుధయుతుం । డై సర్వసన్నద్ధుఁడై
చని సేనం గని వెన్కకేఁగ మరలి ప । శ్చాత్తాపముంబొంది యా
త్మనివాసంబున కేగలేక సడుమన్ । దట్టాడుచుండంబునన్. 816

గీ: బ్రాహ్మణుఁడు, జ్ఞాని వేదపా । రంగతుండు
సత్కులీనుండు దప్పిక । సైపలేక

మదిర నొక్కింతగ్రోలి మై।మఱచి పిదప
డెందమునను పశ్చాత్తాప । మొందినట్లు. 817

గీ. పతియె సతతంబుఁ దనకు దై । వత మటంచు
మదిఁ దలంచియుఁ బూర్వ క।ర్మంబువలనఁ
బతిని విడనాడి దుఃఖించు । సతివిధాన,
నతఁడు పరితాప మొందుచు । నరుగుచుండె. 818

సీ. మహితార్తిదోధూయ । మానమానసుఁ డయ్యెఁ
గన్నులుబాష్ప సి। క్తంబు లయ్యె.
దాన దృష్టియొకింత । గానరాకుండుటఁ
గుండి స్యందనమున। గూలఁబడియె
చెవులు గింగురువోయెఁ । జెవుడు సంప్రాప్తించె
వెరవెఱుంగక బుద్ధి । వికలమయ్యెఁ
బెనుదప్పికంబొంది । పెదవులు శుష్కించె
నీరెఱుంగునఁ గళం । బెండిపోయె.

గీ. ఇట్టి దురవస్థఁ గీడు స।హించి యెట్లు
ప్రాణములు వాని నెమ్మేను । బాయకుండె
ఇనకులుఁడు వెండి యేతెంచు । ననెడు నాస
యొక కవాటమై బాధించి । యుండుఁగాక. 819

ఆ. వె. పల్కలేక నోర । నాల్క తల్లడిలంగ
భూరి దుఃఖభార।మునను గ్రుంగి
రాముఁబాసి యిట్లు । రాజధానికిఁ బోవు
ఖలుని నన్ను సైపఁ । గలరె ప్రజలు 820

సీ. "రాముఁ డేడీ" యంచుఁ । బ్రశ్నింపవచ్చిన
స్త్రీపురుషుల కేమి । చెప్పవలయు?

నెమరుగ నేతెంచి । "యెందున్నవా"రన్నఁ
817 కౌసల్య నేరీతి । మోసపుత్తు ?
"వా రెల్లక్షేమమా । పలుకు"మన్నసుమిత్రి
కెట్టిప్రత్యుత్తరం । బీయవచ్చు ?
"నేఁడి నాసుతుఁ" డంచు । నేడ్చి నన్నడిగిన
818 దశరథు నెట్టు లోఁదార్పనేర్తు ?
గీ. నడవియందున్న వారన్న । నానృపుండు
తృణమువలెఁ బాయకున్నె శరీరయష్టి ?
భళిర ! దుర్భేద్య మగునాదు । వజ్రహృదయ
పంజరము నెట్లు సృజియించెఁ । గంజభవుఁడు ? 821
గీ. సలిలముం బాసి జీవింపఁగలదె జలగ ?
రాము నెడఁబాసి యేనెట్లు । బ్రదికినాఁడ ?
నకట !! యీ యమయాతన । ననుభవింపఁ
బ్రాణములు నిల్చియున్న వీఁపాడుమేన. 822
సీ. అని యిట్లుచింతించి । యనుమాన మొందుచుఁ
దనస్యందనముఁ దోలి । తమసఁ జేరి
అచ్చోటఁ దనతోడ । నరుగుఁదెంచినయట్టి
819 గుహుసేవకులకు వీడ్కోలొసంగి
గోబ్రాహ్మణులఁ జంపు । క్రూరకిరాతుని
చందానఁ బురిఁ జేర । సంశయించి
చీఁకటిపడుదాఁక । మ్రాఁకుచెంత నొకింత
820 విశ్రమించి దినంబు । వెడలఁబుచ్చి

—। అయోధ్యలోఁ బౌరులు పరితపించుట. ।—

గీ. అఖిలదిశలను చీఁకువా । లాక్రమింపఁ
దగినతఱియంచు లేచి రథ్యములఁదోలి

పురవరముఁజేరి ద్వారంబు । పొంత నిల్పి
అంతిపురిఁజొచ్చె నాతఁ డొ।క్కింత ధృతిని. 823

గీ. అంత నాసుమంత్రునిరాక । నాలకించి
ద్వారమునఁనిల్చియున్న స్యం।దనముఁ గాంచి
యూరివారెల్ల రాము వి।యోగమునను
కలఁగిరి జలంబులేని చే।పలను బోలి. 824

క. మంతిరి యాగమనము విని
నంతనె పటుదుఃఖభయస।మావృతపురశు
ద్ధాంతఃపురకాంతాసౌ
ధాంతరములు ప్రేతవనము।లనఁగఁ దనర్చెన్. 825

ఉ. వచ్చినవానిఁగాంచి తమ । భావములందుఁగలంగి "రాఘవుం
డెచ్చట" యన్నచేటికల । కెట్టి సముత్తరమీక "రాజుగా
రెచ్చట"యంచు మంత్రివరు । డించుకయంత ధృతిన్ వహించి తాఁ
జెచ్చెరఁబోయి వృద్ధమహి।షీపరిపోషితభూవరుం గనెన్. 826

గీ. రాజచిహ్నంబు లగు నాభ।రణము లుడిగి
మలినవస్త్రంబుల ధరించి । మగువఁబోలి
కంటఁ గన్నీరుమున్నీరు।గా స్రవింప
నేలఁ బొరలాడుచున్న భూ।పాలుఁగాంచె. 827

గీ. అమృతముం బాసి నట్టిచం।ద్రిమనుఁబోలి
అమరపురబహిష్కృతుని య।యాతిఁబోలి
పక్షములను గోల్పడిన సం।పాతిఁబోలి
ఖిన్నుఁడైయున్న విభుని వీ।క్షించె నతఁడు. 828

— । దశరథుని పరితాపము. । —

గీ. అట్లు వీక్షించి యమ్మంత్రి । యవనిపాలు
పజ్జకుంబోయి జయజయ।ధ్వానముఖరి

తాస్యుఁడై ప్రణామ మొనర్చి । నంత నతని
దరికిరమ్మని యిట్లనె । దశరథుండు. 829

శా. రాముం డెచ్చట? వానితమ్ముఁడు సుమి।త్రాపుత్త్రుఁ డెచ్చోటఁ, శ్రీ
భామారత్నము సీత యెచ్చట ? వనిన్ । బ్రారబ్ధకర్మంబుచే
నీమూఁడ్కిన్ నివసించువార మనిరో? । యేమేమి వాక్రుచ్చిరో
నామోమున్ దిలకించి చెప్పు మిఁక సం।తాపింప నీ కేటికిన్. 830

మ. లలనారత్నము సీతతోఁ గృతయుగా।లంకారుఁ డారాముఁ డా
ర్యులు కీర్తింపఁగ రాజ్యమున్ విడిచి య।య్యుగ్రాటవిన్ జేరె, నే
వలనుంబన్నిన రాఁడు, నాదుపలుకున్ । బాలించుటే పాడిగాఁ
దలఁచెన్; పాపుఁడఁగాక భూపుఁడనె సం।తాపించి దుఃఖించెదన్.

ఉ. "రాజ్యముఁ గొమ్ము వేగముగ । రమ్మని, కైకకులాంగి, దుంపలే
భోజ్యము లంచు ఘోరవన।భూమికిఁ బంపితి, నక్కటా జగ
త్పూజ్యుఁడు శౌర్యధైర్యగుణ । భూషణుఁ డీషణశోషణుండు, సా
మ్రాజ్యము త్యాజ్యమంచు నొక।మౌనివిధంబున నుండవచ్చునే?

గీ. చూడ సుఖదుఃఖములవేళ । సుంతయైన
హర్షమును విషాదముఁ బొందఁ । డట్టివాని
జ్ఞాని నెడఁబాసి జీవింతుఁ । జావలేక
కఠినపాపాత్ముఁడనుగాక । క్షత్రియుఁడనె ? 833

గీ. మిత్రరత్నమ ! శతపత్రపత్రనేత్రుఁ
డైన శ్రీరామచంద్రుని । స్థానమునకు
నన్నుఁ గొనిపొమ్ము వేగ లే।కున్న నింక
క్షణము జీవింపఁజాల ప్రా।ణము లేల. 834

వ. అనిన సుమంత్రుఁ డిట్లనియె । హా రఘువంశపయోధిచంద్ర! స
జ్జనసుత నీతియున్ మఱియు । జ్ఞానముఁ గల్గిన ధైర్యశాలి వ

య్యును పరితాపతప్తహృద । యుండవు గావునఁ దల్లడిల్లెదే
వనమున నున్న రామునకు । బాధ రవంతయు లేదు నమ్ముమా. 835

గీ. జన్మమరణముల్ లాభనష్టములు, భోగ
రోగములును సంయోగ వి । యోగములును
కాలకర్మవశంబునఁ । గలుగు నందు)
తత్వవిదుఁడవు చింతింపఁ । దగునె నీకు. 836

గీ. ఆపదకుఁ గ్రుంగి సంపద । కాత్మఁ బొంగి
సంచరించుట ఖలునకు । సహజగుణము
ఏది యెట్లైన మే లని । యెంచి జ్ఞాని
నిశ్చలుం డయి చరియించు । నిశ్చయముగ. 837

ఉ. జానకితోడఁ గూడి, తమ । సానదిలోన మునింగి, గంగలో
స్నానముఁ జేసి పిమ్మట ని । షాదుఁడు భక్తిని సత్కరింపఁ ద
త్స్థానమునందు భార్యయును । దమ్ముఁడుఁ గొల్వఁగ విశ్రమించి తో
త్తోన శిరోజపాళి వట । దుగ్ధములన్ జడ లల్లి దీక్షతోన్. 838

గీ. నన్ను మన్నించి మఱియుఁ జే । నన్నబిల్చి
సరసఁ గూర్చుండ మనిపల్కి । సరసరీతి
నన్ను నోదార్చి బోధించి । "నన్నుఁ గూర్చి
నృపునకుం జెప్పు" మని రాము । డిట్టులనియె. 839

గీ. "తండ్రి నీపాదములకు వం । దన మొనర్తు
రామునింగూర్చి దుఃఖింప । రాదు నీకు
దలఁప నాపూర్వ సుకృత స । త్ఫలముకొలఁది
వనవాసంబు లభియించె । ఘనుఁడ నైతి. 840

గీ. నీదువాక్యంబుఁ బాలించి । నీమమునను
వనమువవసించి నీపుణ్య । పాదములను

గొలువవచ్చెద" నని చెప్పు । వలయు ననుచు
నన్ను బ్రతిమాలి వేండియు । విన్నవించె. 841

సీ. తనయుల మఱపించి । తండ్రిని సేవించు
తల్లుల కెల్ల బ్ర । దనము లనుము
పరమార్థ మనుదివ్య । సరణిని జూపించు
ఘనున కొజ్జకు నమ । స్కార మనుము
తత్వంబు బోధించి । ధరణిపునోదార్చు
పండితాళికి నభి । వాద మనుము
ధర్మంబు నీతియుఁ । దప్పకుండమెలంగు
పౌరులకున్ సమో । వాక మనుము

గీ. తల్లుల, సమానముగ నెంచి । తండ్రిఁగొల్చి
రాజ్యలక్ష్మిని జేపట్టి । ప్రజలఁ బ్రోచి
మన్ననలఁ బొందవలెఁ గాని । నన్నుఁదలఁచి
భరతుఁ డెన్నండు దుఃఖింప । వలవ దనుము. 842

గీ. కటము లదరంగఁ గోపించి । కఠినముగను
లక్ష్మణుఁడు కొన్ని వాక్యంబు । లను వచించెఁ
దగినరీతిని బోధించి । ధర్మసరణిఁ
దెలిపి రాముండు వాని యు । ద్రేక మణఁచె. 843

గీ. తమకు సందేశముం జెప్పఁ । దలఁచి తుదకు
దుఃఖవశమునఁ గన్నీటఁ దోఁగి తోఁగి
యేమియు వచింపఁజాలక । యేడ్చియేడ్చి
జానకీదేవి యక్కటా । మౌనమూనె. 844

ఉ. అంతట నావతోన నది । యావలకుం జని జంకు దక్కి యే
కాంతనివాసయోగ్య మని । యవ్విపినంబున నేగుచుండ, భూ

కాంత! భవత్కుమారులను । గాననదేవత కిచ్చి నిష్ఠుర
స్వాంతుఁడనై పురంబునకు । వచ్చితి నేక్పుచు నేమిచెప్పుదున్.
చం. అనిన సుమంత్రుఁ జూచి యమ । యాతనఁ బొందినవాని కైవడిన్
దనువు వణంకఁ జేష్టలను । దక్కి దురంతవిషాదవేదనన్
వనరుచు వానకాలమునఁ । బ్రిప్రిథమాఁ బువ్వుఁ గ్రోలినట్టి చే
ప.ననుకరించి, వృద్ధనర । పాలుఁడుఁ గీడ్పడెఁ బీఠనంబునన్. 846
గీ. అట్టితఱి మంత్రియాగమం । బాలకించి,
పికుగుపడినంత నడవిని । తఱఁబడి కలంగు
పులుఁగులవిధానఁ బౌరుల । ప్పురమునందు
ఘొల్లుమనియేడ్చి రమిత సం । క్షోభమునను. 847
గీ. కంఠగత మయ్యెఁ బ్రాణంబు । కాంతిమాసె
నింద్రియము లన్నియుఁ జలించెఁ । దృష్ణహెచ్చె
నృపుని దురవస్థ వర్ణింప । నేరితరము?
జలముఁ బాసిన కమలంబు । సరణినుండె. 848
గీ. అర్కకులపద్మవనభానుఁ । డస్తమించు
ననుచు నూహించి కౌసల్య । యవనినాథు
గాంచి కాలానుగుణ్యంబు । గా వచించె
నెక్కడనొ యున్న ధైర్యంబుఁ । జిక్కబట్టి. 849
సీ. జననాథ! శ్రీరామ । చంద్రువియోగంబు
కడఁజూడఁగారాని । కడలియయ్యెఁ
బదునాలుగేండ్లకు । వచ్చు రాముం డను
నాశాంకురము నౌక । యై రహించె
భవదాశ్రితజనంబు । వ్యాపారిసముదాయ
మీనౌక నిపుడాశ్ర । యించియుండెఁ

గైవర్తకులు మీరు । కరుణించి యెట్లైన
ధృతిఁబూని మమ్ముద్ధ । రింపవలయుఁ
గీ. బురుషపుంగవులున్ వీర । వరులునైన
మీర లీరీతి నేడ్చి య । ధీరులైన
మాకధోగతి ప్రాప్తించుఁ । గాక తుదకు,
బ్రదుకవచ్చునె సుఖములఁ । బడయఁగలమె? 850

ఉ. అత్తఱి వృద్ధభూపుఁ డహ । హా యని యెంతయు సుప్రసన్నుఁడై
చిత్త మిగుర్ప వృద్ధమహి । షీమధురోక్తుల నాలకించి, యా
పత్తు తొలంగినట్లు మది । భావనఁజేసి గతించినట్టి సం
పత్తును గన్నలోభివలె । మాటికి మాటికి సంతసించుచున్. 851

ఆ. చింతఁదక్కియుండె; । నంతలో శ్రీరాము
మగుడ సంస్మరించి । బెగడి తుదకుఁ
గాళరాత్రి లీలఁ । గన్పట్టు నారాత్రిఁ
గడపలేక భార్యఁ । గాంచిపలికె. 852

ఉ. ఓరమణీలలామ విన । వో సరయూనది ప్రాంతనున్న కాం
తారమునందు నంధముని । దంపతులన్ గొనివచ్చు బాలు ని
ష్కారణ మే వధించితిని; । సత్యముఁ జెప్పెద వారి శాప మీ
తీరున నేడు నాకుఁ గడ । తేరని దుఃఖముఁ గూర్చె నక్కటా! 853

ఆ. ప్రాణతుల్యుఁడైన । రామచంద్రుఁడులేని
యీశరీర మేల । పృథ్వి యేల?
రామ రామ రామ । రామసీతారామ
నిమిష మైన నింక । నిలువఁజాల. 854

—। దశరథుఁడు పుత్రవియోగశోకమున మరణించుట. । —

సీ. అహహా పితృవాక్యపరిపాల । నార్థ మటవి
కేగితే రాజ్యముం బాసి । యినకులాఢ్య

నాదు హృదయ చాతకపక్షి । నాదరించు
జలదుఁడవు నీవు కోమల । శ్యామలాంగ. 855

గీ. "జానకీరామ ! యినకుల । జలధిసోమ!
రామ! నిర్జితభార్గవ । రామ"యనుచు
స్వర్గలోకంబున సుఖంప । నిర్గమించి,
ధన్యతముఁడయ్యె దశరథ । ధరణివిభుఁడు. 856

సీ. అంత నంతఃపుర । కాంతలు దుఃఖించి
రతనిశీలము నెంచి । యశముఁదలఁచి
ఇనకులమార్తాండుఁ । డిపు డస్తమించెనే
యని పౌరు లెల్లరుఁ । గసికరించి
రింతలో నెంతటి । వంత చేకురెనంచు
బ్రాహ్మణప్రవరులు । పరితపించి
రక్కటా! జగజంత । యైన కైకకుఁ జింత
లేదాయె యని స్త్రీలు । క్లేశ మొందె

గీ. రట్లు రామచంద్రునిఁ బంపి । యిట్లు విభుని
ప్రాణములఁ బాపి సామ్రాజ్య । వైభవముల
జుట్టుకొనఁ నెంచెఁ గైకమ్మ । ఘోర్తుదీఅ
ననుచుఁ గలపౌరు లేడ్చిరి । పనవిపనవి. 857

—। భరతశత్రుఘ్నులు పురమున కేతెంచుట ।—

సీ. కాళరాత్రిచనిన । కైవడి నారాత్రి
గతియించె విజ్ఞాన । ఖని వసిష్ఠుఁ
డతివేగముగవచ్చి । యితిహాసములను త
త్కాలానుకూలంబు । గా వచించి
దశరథు దేహంబు । తైలపక్వముఁజేసి
భరతు నాహ్వానింప । వలయు ననుచు

దూతలఁ బిలిపించి । "దుర్వార్తఁ దెలుపక
భరతుఁ దోడ్కొనిరండు । త్వరితగతిని

గీ. తడయఁదగ దింక నతఁడు సో । దరునితోడఁ
బరుగునన్ వచ్చు సాహిణి । భావమెఱిఁగి
పఱచుగుఱ్ఱంబువలె" నంచు । వారిఁ బంపి
అప్రమత్తుఁడై యితర కా । ర్యముల నరసె. 858

గీ. అచట భరతుండు దుశ్శకు । నావిలాత్ముఁ
డై యభీష్టదైవతముల । నభినుతించి
దానధర్మముల నొనర్చి । తనివిదీఱ
భూమిసురకోటికిన్ భూరి । భోజన మిడి. 859

గీ. ఉల్ల మనుమానవశమునఁ । దల్లడిల్లఁ
దనదు పురికింకఁ బోఁదగు । ననితలంచె
నంత నచ్చోటికిన్ దూత । లరుగుదెంచి
ఎఱుఁగఁజేసిరి గురువాన । తిచ్చినంత. 860

గీ. మంచి దని యొకించుక సంశ । యించి లేచి
మేనమామకుఁ జెప్పి స । న్మానమొంది
వాయువేగంబు మించు న । శ్వములఁబూన్చి
బురికిం జనుదెంచెఁ దనదు సో । దరునితోడ. 861

గీ. అరయ నే నసూర్యంపశ్య । నగుదు ననుచు
నుర్విఁగలయెల్లరకుఁ జాటు । చుండె ననఁగ
నంధకారావృతస్థలి । నణఁగి మణఁగి
గుండె లవియఁగ నపుడొక్క । గూబ యఱచె. 862

సీ. ఇది యేమియాశ్చర్య । మేచాయఁజూచిన
దుర్నిమిత్తంబు లే । తోఁచుచుండెఁ

పౌరుల ముఖములఁ । బరికింప నక్కటా
యాపదసూచించు । నట్టులుండె
దిగ్గజంబులభంగిఁ । దేజరిల్లు గజంబు
లెందుఁ గన్పట్టని । హేతు వేమొ?
సతతయాతాయాత । శకటంబులు చరింప
విట్లుండెనే పురం । బెన్నఁడైన

గీ. విపణివీథియు సడిలేక । వింతగొలిపె
భళిర దారిద్ర్యదేవత । ప్రబలెనేమొ
తొంటిశైవడి సుంతయుఁ । దోపకున్న
దెంతయుం జోద్యముగనున్న । దీపురంబు. 863

గీ. ఇది యయోధ్యాపురం బౌనె? । యీవిధంబు
నెన్నఁడున్ జూడ నిట్లుండ । హేతు వేమొ?
యనుచు నలుదిక్కు లరయుచు । జనులఁ జూచి
బెదరుచున్ వచ్చె భరతుండు । భీతిదోప. 864

క. కలిమిన్ గోల్పడులోభుల
వలె దుస్తరదుఃఖభార । వశులై నృపపు
త్రులఁగని మాటాడక, మో
ములనెత్తక, మ్రొక్క, తొలఁగఁ । బోయిరి పౌరుల్. 865

— భరతుఁడు కైకను దూషించుట —

కం. ఘనుఁ డాభరతుం డంతటఁ
దనయింటికి నేగెఁ దొలుతఁ దల్లిం జూడన్
ఇనకుల వనరుహ చంద్రిక
యననొప్పిన కైక యతని । నక్కునఁ జేర్చెన్. 866

గీ. అడవిలో నగ్నిఁ బెట్టి మా । గ్ధ్యమునటించు
కపటపుఁగిరాతిచందానఁ । గైకయులరి,

శోకసంతప్తుఁ బుత్త్రినిఁ । జూచిపలికె
మామకున్ జుట్టములకు క్షే।మంబె చెప్పుము. 867

చం. అనవిని యాతఁ డెల్లరకు । నచ్చట క్షేమమయంచుఁ బల్కి యి
ట్లనియెను, "తండ్రికిన్ గుశల।మా ? స్థిరకీర్తికి రామమూర్తి కా
తనిసతి సీతకున్ మఱియుఁ । దమ్మునకున్ గుశలంబె? చెప్పుమా
జనని! చలించుచున్ మనము । సంశయమొందుచున్నది త్తఱిన్."

గీ. అనిన విని శంక యించుక । యైనలేక
కైక భరతుని ముఖమును । గాంచి, యతని
శ్రవణహృదయంబులకు శూల।సమము లైన
వాక్యములఁ గొన్ని వచియించె । భయముఁదక్కి. 869

గీ. "నేసహించిన మాటల । నీవు విన్న
నీకుఁ గోపంబువచ్చును । నిక్కువముగఁ
దాదకు మంథర చూపించె । బ్రదుకుఁదెరవు;
నిర్గమించెను మీతండ్రి । స్వర్గమునకు." 870

కం. పితృగడఁచిన చందంబునఁ
బుడమింబడి దుఃఖభార।మున నా భరతుం
డడలుచుఁ బొక్కినయంతనె
వడివడిఁ గందోయిబాష్ప।వర్షము గురిసెన్. 871

కం. జనకా ! నీముఖపద్మం
బును సందర్శించుభాగ్య।మును గోల్పడి వ
చ్చిన దౌర్భాగ్యుఁడ నకటా
నను రామున కప్పగించి । నాకవె కరుణన్. 872

గీ. అనుచు నెంతయు విలపించి । జననిఁ జూచి
ఇంతలోఁ దండ్రి యీరీతి । నంతరింపఁ

దగినకారణ మున్నదె । తల్లి చెప్పు
మనిన సానని కైక యిట్లనియె నెలమి. 873

మ. "తనయా! యున్నరహస్యమున్ బలికెదన్ । ధాత్రీంద్రుఁడీరాజ్యమున్
ఘనుఁడంచున్ రఘురామచంద్రునకొసం । గన్ యత్నముం జేసె; దా
మును నాకిచ్చినట్టి రెండువరముల్ । ముద్దారఁ గాంక్షించితిన్
విను, రాముం డడవిన్ వసింపఁగను, పృథ్విన్ నీవు శాసింపఁగన్.

గీ. రాముఁ డరిగినయంత నరణ్యమునకు
నాతని వియోగమును రోగ । మలముకొనఁగ
శోకసంతప్తచిత్తుఁడై । స్రుక్కి తుదకు
నిర్గమించెను మీతండ్రి । స్వర్గమునకు. 875

చం. జరిగిన దేదియో జరగెఁ । జచ్చిన నీజనకుండు లేచిరా
డరసి వివేకముం గలిగి । యందఱు మేలన రాజ్యలక్ష్మిఁ గొ
మ్మరుణితనేత్రకోణగళి । తాంబుకణంబులఁ దుడ్చికొమ్ము భూ,
వహుఁబహాసి పరే, చిఱుత । వానివిధంబున నిట్టు లేడ్చినన్." 876

గీ. కైక పలుకులు కాలిన । గాయమునకు
నుప్పుఁదగిలించినట్లుండ । నొప్పిఁగలిగి
ఓర్పువిడనాడి యేడ్చి నిట్టూర్పు విడిచి
చేయునది లేక యించుక । చేష్ట లుడిగి. 877

ఉ. "ఆకట, తండ్రి చచ్చె నని । నంతనె యంతయు నేడ్చుచుంటి, సు
శ్లోకుఁడు రామచంద్రుఁడు వ । సుంధరఁ బాసి వనాంతరంబునన్
దేఁకువతో వసింపఁజనె । నే? మును దోచిన గోరుచుట్టుపై
రోఁకటిపోటుఁ గొంటి" నని । రోసె నతండు దురంతచింతచే. 878

ఉ. "మండినపుండు ప్రజ్వలిత । వహ్నికణంబులు సోకినంత నె
ట్లుండునొ, యీపె పల్కిన దు । రుక్తులబాధయు నట్ల యున్న దీ

చండి మదర్థమై జనకుఁ । జంపి కులంబు నశింపఁజేసె; రా
ముం డట కాననుండునట । భోగము లేటికి వల్లకాటికిన్. 879

మం. అని దుఃఖించి యొకించుకంత ధృతితో । నాత్మైక నీక్షించి, య
య్యనఘుం డోరువలేక యిట్లనియె, "సన్యాయంబుగా రామచం
ద్రునిఁ గాంతారముఁ జేర్చి నేటికిఁ గుల।ద్రోహంబుఁ గావించితే?
జననీ! రాముఁడులేనిరాజ్యమును సం।సారంబు నిస్సారమా. 880

చం. పుడమిని నన్యగర్భమునఁ । బుట్టక పాపపుఁబుట్టయైన నీ
కడుపునఁ బుట్టినాఁడ, ననుఁ। గాంచినయంతనె చంపియున్న, రా
ము డడవికేగునే, యకట । భూవరుఁ డీగతిఁ జచ్చియుండునే?
బుడుతలఁ బొట్టఁబెట్టుకొనఁ । బుట్టితె తల్లివె నీవు డాకినీ. 881

గీ. పెరఁటి కల్పవృక్షంబును । పెల్లగించి
చిగురుపై నీరు జల్లిన । క్షేమ మగునె?
ఎంతపాపాత్మురాలవే । చింతఁదక్కి
ఇంట నేరీతి నుంటివే । ధృతివహించి. 882

గీ. రవికులంబున దశరథ।రాజవరుని
గర్భమునఁబుట్టి రాముఁ డ।గ్రజుఁడుగాగ
సంతసించితిఁగాని రా।క్షసివి నీవు
జననివైతివి నాపాప।సంచితమున. 883

గీ. ధర్మదేవతయని చెప్పఁ।దగిన తల్లి
జానకీదేవి యడవిలో । సంచరింప
నక్కట! యధర్మదేవత । వైన నీవు
నానతిన్ భూమిఁ బాలింప । నన్యాయమగునె? 884

గీ. సకలజననుత తేజస్వి । సద్యశస్వి
యైన శ్రీరామచంద్రుండు । కాననుండ

నష్టమగు నేని, పరమపా।పాత్మురాల !
నరకమునసైన నీకు స్థా।నంబు గలదె ? 885

గీ. కపటభావంబుఁ గలిగిన । కఠినచిత్త!
ఇట్టి దుర్బుద్ధి జనియించి । నట్టివేళ
నెట్లు వ్రక్కలుగాకుండ । హృదయముండె
జిహ్వయున్ దెగిపడకుండెఁ । జిత్రమహహ. 886

గీ. అమ్మయని నిన్ను మన్నించి । యనవరతము
పదములకు మ్రొక్కు శ్రీరామ । భద్రు నెట్లు
వనికిఁ బొమ్మంటి నోరెట్లు । వచ్చె ? నోర
నకట ! పురుగులురాల దు।ష్టాత్మురాల ! 887

గీ. అవనివిభుఁడు నీయిష్టంబు । ననుసరించి
మెలఁగఁదలఁచెనె, యతనికి । మృత్యువేళ
బుద్ధినశియించెఁగాక, య।శుద్ధమైన
ఇట్టి దుర్బుద్ధి యేటికిఁ । బుట్టె నీకు. 888

గీ. మాయలన్ కపటోపాయ । మర్మములను
దుర్గుణంబుల స్త్రీలు నై।సర్గికముగఁ
గలిగియుందురు, వారలఁ । గంజభవుఁడు
నెఱుఁగలేడని నేనిశ్చ । యింపవలసె. 889

గీ. సత్యశీలుం డుదారుండు । సద్గుణుఁడు
సకలధర్మంబు లెఱిఁగిన । జనవరుఁడు
ఆమహారాజు నీనైజ । మరయలేక
వంచితుండయ్యె నకట ! నా।పాపమునను. 890

చ. ఇనకులుఁ డేగెనంచు గతి । యిట్లు ఘటిల్లినదంచు నెంతయున్
వనరెద నేమిలాభమని; । పాపమొ సాధుమునీంద్రశాపమో

వనరుహగర్భ నాకుఁ దెలుపందగుఁ; బాపమయేని యీమె కు
ఖ్షని బడవైచితే, యితర। శిక్ష ఘటింపఁగఁదోపకుండెనే? 891

వ. జనకుఁడు రామరామయని। చచ్చెఁగదాయని యెంచియేడ్వనా?
అనఘుఁడు జ్యేష్ఠుఁ డుగ్రవిపి। నాంతరసీమకుఁ బోయె నంచు న
వ్వనమున కేగి వానిపద। పద్మములంబడి వేడుకొందునా?
జనని దురాత్మురాలనుచు। సంద్రమునందు మునింగి చావనా? 892

ఁ. అనుచు దుఃఖించి యెంతయు। నాగ్రహించి
నీదువదనంబు వీక్షింప। రాదు జనని!
యంచు దూషించి శ్రీరాము। నభినుతించి
అధమవిధి యెంతచేసితే। యనుచు నేడ్చె. 893

. అంత శత్రుఘ్నుఁ డింతయు। నాలకించి
జ్ఞాతిదాసియె యింతకు। హేతు వనుచు
నామె పన్నిన మాయగా। నాత్మ నెంచి
ఎల్లెడంజూచె మంధర। యేది యనుచు. 894

. సమయ మిది యంచుఁ బన్నీట। జలకమాడి
తిలకముందిద్ది కురులను। దీర్చి కువ్వి
చలువఁజేసిన జలతారు। వలువఁగట్టి
ఒడలునిండఁగ బంగారు। తొడవులూని. 895

. తనదు సింగారముం జూచి। తన్నుఁ జూచి
తా నొనర్చిన కార్యంబుఁ। దలఁచి మెచ్చు
లిచ్చు నని యెంచి జరగిన। దెఱుఁగలేక
దూరముగనుండె మంధర। తొంగిచూచు. 896

అపుడు శత్రుఘ్నుఁ డొయ్యారి। వగఁదు వనుచు
సరస కేతెంచి లంజెకొ। తుర యటంచుఁ

గొప్పుఁ జేబట్టి నేలకుఁ । గూలఁద్రోసి
గుండియలఁ దన్ని యిట్లనె । మండిపడుచు. 897
శా. "ఔనే మంథర ! యెంతచేసితివె ? యన్యాయ్యంబుఁ గావింపగా
నౌనే ? కొండెములన్ వచించి కపటవ్యాపార మేపార, భూ
జానిన్ జంపితె ? రామచంద్రుఁడు యశస్సంపన్నుఁ డేనాడు నీన్
నోనాడ్జెన్? భరతుండు మెచ్చుకొని సంతోషించు నం చెంచితే?"
గీ. అనుచు దూషించి "నీనాల్కఁ । దునుమకున్నఁ
బాప మగు"నంచు మోముపైఁ । దాఁపుఁదన్నె;
దంతములు రాలి నోర రక్తము స్రవింప
వడఁకుచున్ నాల్క తడఁబడఁ । బలికెఁ గబ్జ 899
మ. కరుణింపందగు మేలుచేసితిఁగదా । కైకమ్మకున్ నన్ను ని
ష్ఠురతన్ గొట్టిన మీ కధర్మమగునంచున్ మ్రొక్కినన్ జూచి "మం
థర ! వంచింపకు"మంచు ఖడ్గధరుఁడై । దండింప నుంకించినన్
భరతుం డచ్చటి కేగుదెంచి కరుణన్ । వారించె శత్రుఘ్నునిన్.
గీ. అట్లు వారించి, "యిచ్చోట । నాలసింప
దోస మగు"నంచుఁ దమ్మునితోడ నపుడు
జనని కౌసల్య వీక్షింపఁ । జనియె వేగ
సుగుణ నిరతుండు భరతుండు । సుజనహితుఁడు. 901

—। కౌసల్యా భరతుల సంభాషణము ।—

గీ. మలినవస్త్రంబుల ధరించి । మంచమునను
బండుకొని యాత్మగత శోకభారమునను
చిక్కి గ్రీష్మర్తులతవోల్కి । స్రుక్కియున్న
తల్లిఁ గౌసల్యఁ గాంచి రా । దాశరథులు. 902
గీ. భరతశత్రుఘ్నులం గాంచి । పరితపించి
దుఃఖ ముప్పొంగఁ గన్నీటఁ । దోఁగితోఁగి

శూన్యదృక్కుల దిక్కులఁ । జూచి చూచి
లేచి కౌసల్య యూఁదల । యూచి యూచి. 903

ఉ. మాయను బన్నెఁ గైక వినుమా యను, నెట్లు సహింతు రామ రా
మా యను, నీవె దిక్కెఁక నుమా యను, సర్వము వ్యర్థ మయ్యె సు
మ్మా యను, రండవే, పురర। మా యను, నింకఁ బురంబు నేలు కొ
వ్వా యను, దుర్యశంబుఁగను। మా యను, మీకిదిధర్మమా యనున్.

గీ. నందనవనంబు వీక్షింప । నాథుఁ డేగె
భయదవనమునకున్ రామ । భద్రుఁడేగెఁ
బితృవనంబున కేనును । వెడలనుంటి
శాశ్వతంబుగఁ బొందుఁడీ । సౌఖ్యములను. 905

గీ. వెర వెఱింగిన కైకమ్మ । గురువు గాఁగఁ
దంత్రపరతంత్ర మంథర । మంత్రి గాఁగ
రామునిం ద్రోసిరా జని । రాజ్యలక్ష్మి
ననుభవింపు మాచంద్రతా । రార్కముగను. 906

కం. తలిదండ్రులఁ జుట్టంబులఁ
జెలులన్ విడనాడి యకట । శ్రీరాముఁడు కా
నలకున్ జనె ననుచితన్
గలకాలము రాజ్య మేలఁ । గలవో లేవో ? 907

గీ. అనుచు నీరీతిఁ బల్కి న । య్యంత నామె
చరణముల వ్రాలి బాష్పవ । ర్షమునఁ దడిసి
పరమపాపాత్మురాలిగ । ర్భమునఁ బుట్టి
నట్టి నా కెట్టిశిక్షయే । నర్హ మగును. 908

గీ. కైక యనుఘోరరాక్షసిన్ । గమలగర్భుఁ
డేటికి సృజించెనో ? సృజి । యించెఁగాక

జిహ్వ యనునది లేకుండఁ జేసియున్నఁ
దల్లి! యీరీతిఁ గీడు వాటిల్లి యున్నె? 909

గీ. కులమునకు మచ్చఁ దెచ్చె, వ్యాకులముఁ గూర్చె
జనకునిం జంపెఁ దనయుల వనికిఁ బంపెఁ
గైకకడుపునఁ బుట్టినఖలుఁడ, నిట్టి
దుర్దశకు నేన హేతుభూతుండ నైతి. 910

గీ. భానువంశంబు ధ్వంసంబుగా నొనర్చు
ఖలుఁడు వీఁ డనఁ బాపంబుఁ గట్టుకొనఁగఁ
గైకకడుపునఁ బుట్టితిఁ గాక యకట!
ఏను స్వయముగ నేపాప మెఱుఁగ నమ్మ. 911

సీ. వేదంబు నన్నంబు విక్రయించినవిప్రుఁ
డేగెడుసద్గతి కేగువాఁడ
గోశాలలం గాల్చి గోవుల వధియించు
పాపాత్ములోకంబు బడయువాఁడ
శిశుబాలవృద్ధుల స్త్రీలను హింసించు
నతినికృష్టునిశిక్ష కరుగువాఁడ
నయమున మిత్రుని నమ్మించి తుదకు వం
చించినపాప మార్జించువాఁడఁ

గీ. దల్లిదండ్రుల గురువుల ధరణిసురుల
సోదరులఁ జంపి యైశ్వర్య మొందువాని
సరణి నరకకూపమునకుఁ జనెడువాఁడఁ
గపటభావంబుఁ గలిగిన ఖలుఁడ నేని. 912

సీ. అగ్రహారంబుల కనలంబుఁ దగిలించి
యగ్రజన్ములధనం బపహరించి

ధర్మంబుఁ దలఁపక । కర్మంబులం జేసి
యన్యులతప్పు లం।దాడుఁ జాటి
కపటియై కుటిలుఁడై । కలహంబుఁ గల్పించి
యార్యులకుం బ్రాణ।హానిఁ గూర్చి
లోభియై విషయవి।లోలుఁడై వర్తించి
వేదేతరమతంబు । విశ్వసించి
అనృతము వచించి యన్యుల । నటమటించి
ముగ్ధలం గాంచి వలపింప । ముచ్చటించి
మెలఁగుపాపాత్ముగతి నాకుఁ । గలుగుఁగాక
కపటభావంబుఁ గలిగిన । ఖలుఁడనేని. 913

పావనంబైన శ్రీవిష్ణు।సేవఁ బాసి
భూతగణములఁ గొల్చుదు।ర్జాతిపగిది
ఘోరనరకకూపంబునఁ । గూలువాఁడ
గపటభావంబుఁ గలిగిన । ఖలుఁడనేని. 914

వైదికపథంబు విడిచిన। బ్రాహ్మణువలె
విను మనిర్వాచ్యగతి కేగు । వెడలువాఁడ
రామునిం ద్రోసిరా జని । రాజ్యకాంక్షఁ
గపటభావంబుఁ గలిగిన । ఖలుఁడనేని. 915

హరిహరుల సన్నుతింపని । యట్టివాఁడు
ధర్మమార్గంబు విడిచిన । ధరణివిభుఁడు
నేగునట్టి లోకంబున । కేగువాఁడఁ
గపటభావంబుఁ గలిగిన । ఖలుఁడనేని. 916

రాము విడనాడి తుచ్ఛసా।మ్రాజ్యలక్ష్మిఁ
బడసి సుఖయుక్తిఁ దలఁచిన । జడుఁడనేని

కామధేనువు నిరసించి । గార్దభంబు
పాదముల నాశ్రయించిన। వాఁడ నగుదు.

గీ. సకలభువనంబు లేలువి।శ్వంభరుండు
స్వల్పరాజ్యంబుఁ బాలింపఁ । బాలుపడునె
పతితపావనప్రఖ్యాతిఁ । బడసినట్టి
అతనిపాదరక్షలు చాలు । నవని నేల.

గీ. భోగములఁ గోరి యాతండు । పుట్టలేదు
ఏను పాలింపవలె నని । యేగలేదు
అతని నెఱుఁగుదు నేను న । న్నతఁ డెఱుంగు
నాత్మసంకల్పసిద్ధికి । నడవి కేగె.

గీ. సంపద లభించె నని నైక । సంతసించు
సర్వము నశించె నని నీవు । సంచలింతు
సకల మెఱిఁగిన కారణ।జన్ముఁ డతఁడు
ఏటి కీరీతి దుఃఖింప । నింకఁ దల్లి.

గీ రాజ్యముఁ దృణంబుగా నెంచి । రాముఁ డడవి
కరిగె నాతని భక్తుండ। నైన నేను
విపులవిశ్వంబు తృణ మని । విశ్వసించి
ఎచటికేని పోయెద నాన।తిమ్ము తల్లి. 9

గీ. అనినభరతునిఁ గౌసల్య । యాదరించి
అతఁడుపలికిన శపథంబు । లాత్మ నెంచి
మిగులఁ బ్రీతించి యొతయు । వగచి వగచి
తనదువాత్సల్య మేపార । ననియె నిట్లు. 9

ఉ. "రామునియందు భక్తియును । రాజ్యవిరక్తియుఁ గల్గి సద్యశో
ధాముఁ డవైతి నీవు పరి।తాపవశంబున నంటిఁగాక నీ

లో మలినంబు లేమి గుణ।లోలుఁడ వౌదువు భాగ్యభోగని
ష్కాముఁడ వార్యధర్మపథ।గామివి నీయెడ దోస మందునే. 923

గీ. కడఁగి యమృతాంసుఁడు విషంబుఁ । గ్రక్కఁగాక
జాతవేదుండు హిమమును । జార్చుఁగాక
జలచరంబులు మృగతృష్ణ । మెలఁగుఁగాక
ప్రతిఘటింపవు కలనైన । రామచంద్ర. 924

గీ. అనఘ ! భవదీయశపథవా।క్యముల కాత్మఁ
బరితపించెద నెంతయుఁ । బావనుఁడవు
నిక్కవంబుగ, సద్ధర్మ।నిరత భరత
మండలేశ్వరమండల।మండనుఁడవు." 925

గీ. అట్లు భరతుని నొకరీతి । ననునయించి
ఆత్మగత మైనదుఃఖంబు । నపనయించి
ఆపె యార్తార్తిఁ గడపె; న।య్యవసరమున
వామదేవవసిష్ఠు లా।భవనమునకు. 926

గీ. వచ్చి విప్రుల మంత్రులఁ । బౌరవరుల
సత్వరంబుగఁ బిలిపించి । తత్వవిదుని
భరతు నోదార్చి పరమార్థ।వచనములను
అపరకర్మంబుఁ జేయించి । రవనిపతికి. 927

సీ. సరయూనదీతీర।సమభూతలంబున
స్వర్గసోపానమా।సరణి నొప్పు
చందనచితిఁ బేర్చి । శవమును నంటించి
దహనసంస్కారంబుఁ । దగ నొనర్చి
తిరుగ స్నానముఁ జేసి । పొరలి పొంగినబాష్ప
జలధారతోఁ దిలాం।జలి యొసంగి

జనసమ్మతంబుగ సర్వభూసురకోటి
దానధర్మంబులఁ దనియఁ జేసి

గీ. సహగమనవాంఛ నేతెంచు సతులఁ జూచి
వలదు వల దంచు శ్రీరామభద్రుఁ జూడ
వలయు నని చెప్పి వారించి పౌరవరులు
బాగు బాగన వర్తించె భరతుఁ డపుడు. 928

గీ. కాల మొక్కింత మెల్లఁగఁ గడచుచుండ
నొక్కనాఁ డంతట వసిష్ఠుఁ డూరనున్న
పౌరవరులను మంత్రుల బ్రాహ్మణులను
బిలిచి, భరతుని వీక్షించి పలికె నిట్లు. 929

గీ. మంథరయుఁ గైక పన్నినమాయవలన
నింతటియనర్థము ఘటిల్లె నృపునిసత్య
వాక్యముఁ బాలింప రాముండు వనికి వెడలె
రాము నెఱుఁగనివా రుందురా జగాన. 930

గీ. అని గగుర్పాటుఁ జెంది రా మునిఁ దలంచి
అతనిగుణశీలముల నెంచి యభినుతించి
జానకీదేవి లక్ష్మణు సన్నుతించి
భరతు నోదార్చి ధృతిఁ బూనవలయు ననుచు. 931

గీ. మంచిచెడ్డలు జీవితమరణములును
బ్రహ్మవశములు భువిఁ దప్పి బ్రదుకఁగలమె
పౌరుషము పౌరుషం బని పలుకుచుండ్రు
భరత ! వినుము దైవము బలవత్తరంబు. 932

గీ. భానుఁడున్ జంద్రుఁడున్ గ్రహబాధఁ గనిన
భద్రగజములు సింహముల్ పట్టువడిన

సుజనులు సతంబు లేమిని । గ్రుక్కుచున్న
నింక నేమైన దైవంబ । హేతు వగును. 933

కం. ఎప్పటి కెయ్యది కావలె
నప్పటి కయ్యది ఘటిల్లు । ననునమ్మకమున్
దప్పక మెలఁగుము, కీడుం
దప్పింపఁగ నీకు నాకుఁ । దరమా చెప్పుమా. 934

చ. ఎవరినిఁ దిట్టినన్ ఫల మొ।కింతయు లే దనవచ్చు, వృద్ధభూ
ధవుఁడు గతించె నంచుఁ బరి।తాపముఁ బొందిన లాభ మున్నె? ఘో
రవిపినసీమ నున్న రఘు।రాముఁడు రాఁ డిపు డింకఁ జింతయే
యవసర మైనఁ బెక్కుగల।వంశము లాత్మఁ దలంచి చింతిలన్.

సీ. ఆత్మధర్మము మాని । యన్యధర్మముఁ బూని
విషయలంపటుఁ డైన।విప్రుఁ దలఁచి
స్వప్రయోజన మెంచి । ప్రజలను వంచించి
రాజనీతిఁ ద్యజించు।రాజుఁ దలఁచి
దైవభక్తిఁ దొలంగి । ధన మున్న దని పొంగి
పరులను నిరసించు।వైశ్యుఁ దలఁచి
బ్రాహ్మసురుపై నల్గి । గర్వభావముఁ గల్గి
క్షుద్రుఁ డై వర్తించు।శూద్రుఁ దలఁచి

గీ. మగనికను గప్పి కులములోఁ । దగవుఁ దప్పి
స్వేచ్ఛగఁ జరింపఁ బోయిన । స్త్రీఁ దలంచి
ఓర్వఁగా లేక చింతింప । నొప్పఁగాక
వ్యర్థముగ నిట్లు చింతింప । నగునె నీకు. 936

గీ. జ్ఞానవైరాగ్యహీనస।న్న్యాసిఁ దలఁచి
దయయు దాక్షిణ్యమున్ లేని।తపసిఁ దలఁచి

పరులసౌఖ్య మెంచని స్వార్థ।పరుఁ దలంచి
ఆత్మ నెంతయుఁ జింతింప। నగును గాదె? 937

చ. గురువులఁ దల్లిదండ్రులను। గోవిదులన్ నిజసోదరాదులన్
నిరసనదృష్టిఁ జూచి, యవి।నీతిఁ జరించి పరాపకారియై
తరుణము దైవమున్ మఱచి। దాంభికవృత్తిని స్వప్రయోజనం
బరసి సుఖించునాస్తికుని। నాత్మఁ దలంచి తపింపు మెంతయున్.

గీ. అంతియేకాని వృద్ధుఁడై।నట్టితండ్రి
స్వర్గమున కేగె నని యింత। వగవఁ దగునె
అతనికర్తవ్య మంతయు। నంతరించె
దేవతాలోక మతనిప్ర।భావ మెఱుఁగు. 939

గీ. వత్స! దిక్పాలురను బోలు।పావనులను
తనుజులం గాంచి యాతండు। ధన్యుఁ డయ్యె
అడవికేగినరాముని।యట్ల నీవుఁ
దండ్రియానతిఁ దలఁ దాల్పఁ। దగును చూవె. 940

గీ. రాజపదమును నీ కిచ్చి। రాజవరుఁడు
సుప్రసిద్ధుఁడై తనదుస।త్యప్రతిజ్ఞ
నుర్వి నిలుపంగ రామవి।యోగరోగ
బాధకుం జిక్కి విడిచెఁ బో। ప్రాణములను. 941

గీ. అతఁడు కృతకృత్యుఁ డయ్యె స।త్యంబు నిలిపి
అతనిపుత్త్రుండ వాతని।యాజ్ఞఁ బట్టి
ధర్మయుతముగఁ బాలించి। ధరణియందు
సద్యశోవంతుఁడవు కమ్ము। జనులు పొగడ. 942

చం. జనకునియానతిన్ జనని। జంపి వరంబులఁ గాంచి వెండియున్
జననికి జీవనం బొసఁగి। సద్యశముం గొనె భార్గవుండు, జ

వ్వనమును దండ్రి కోరె నని । భక్తి నొసంగి యయాతిపుత్త్రుఁడు౯
ఘనుఁ డనఁ నొప్పె; నక్కరణిఁ । గ్రాలుము నీవును దండ్రియానతి౯.

గీ. అనుచితమొ లేక యుచితమో । మనమునందుఁ
దాఁ దలంపక యెవ్వాఁడు । తండ్రియాజ్ఞ
నౌదలం దాల్చి పాలించు । నతఁ డశేష
సౌఖ్యములఁ గాంచు నని యండ్రు । శాస్త్రవిదులు. 944

గీ. నాదు నానతిఁ జాలించె । నాతనూజుఁ
డంచు నీతండ్రియు౯ సంత।సించు దివిని
దోష మావంతయును లేక । తుదకు నీవు
పుణ్యవంతుండ వయ్యెదు । భూతలమున. 945

చం. ఎవనికిఁ దండ్రి రాజ్యరమ । నిచ్చెనొ యాతఁడె పట్టభద్రుఁడై
భువిని రహించు నంచు గుణ।భూషణ! వేదములు౯ వచించు; జం
కు విడిచి రాజ్యలక్ష్మిఁ గయి।కొమ్ము శుభమ్మగు నీకు, జానకీ
ధవుఁడును నిన్ను మెచ్చి ప్రమ।దంబును బొందు ననేకభంగుల౯.

చ. అనుచితమైనకార్య మిది । యంచు నెవండు వచింప నోపు, నే
యనఘుఁడు "తండ్రియాజ్ఞ నితఁ । డౌదలఁ దాలిచెఁ" నంచు మెచ్చఁ డే
ప్రజలను నీవు తండ్రివలె । సంతతిగా మది నెంచి యేలిన౯
జననులు మువ్వురు౯ మిగుల । సంతస మొందెద రెల్లవేళల౯. 947

గీ. భరతుఁడే రామచంద్రుని।భక్తుఁ డనుచు
నెవ రెఱుంగరు చెప్పుమా । నృపతనూజ!
కానఁ బదునాలుగేఁడులుఁ । గడపి తుదకు
రాకయుండునె రాముండు । రాజ్యమునకు." 948

గీ. అంతఁ గౌసల్య భరతుని । ననునయించి
"వత్స! గుర్వాజ్ఞఁ బాలింప।వలయు నీవు

దేశకాలపాత్రంబుల। తెఱఁ గెఱింగి
సంచరించుట మేలు వి।పాద మేల ? 949

గీ. నీకు సామ్రాజ్య మర్పించి । నీకు జనకుఁ
డకట ! దివి కేగ శ్రీరాముఁ । డడవి కేగఁ
బగ్గములు లేనిగుఱ్ఱముల్ । పౌరవరులు;
ధైర్య మూనుము చాలుఁ గా।తరత భరత! 950

గీ. ప్రజలకున్ వృద్ధులకు మాకు । బ్రాహ్మణులకు
నీవ, యవలంబకుండవు । నిక్కువముగ
సమయమున్ జూచి దుర్విధి।సరణి నెంచి
శోకసంతప్తజనులఁ । జూడు మింక. 951

గీ. అనిన ధర్మధురంధరుఁ । డైనభరతుఁ
డంతటన్ లేచి శ్రీరాము । నాత్మఁ దలఁచి
హస్తముల మోడ్చి, యాత్మ ధై।ర్యము వహించి
మృదుమధురనీతివాక్యంబు । లిట్లు పలికె. 952

చం. గురువరుఁ డానతిచ్చినది । కోటిశుభంబుల కుద్ది యౌను; కా
తరతఁ ద్యజింపు మంచుఁ బెద।తల్లియుఁ బల్కె, సభన్ గలట్టిమె
ల్లరును వశిష్ఠమౌనికి బ।లంబుగ నౌ నని సమ్మతించి రె
వ్వరుసఁదలంచినన్ మునుల। వాక్కు లమోఘము లింతయేటికిన్.

గీ. తల్లిదండ్రులు గురువులు । దయఁ దలంచి
చెప్పినట్లు వర్తించిన । శ్రేయ మగును
ఆర్యులు నుతింప, ధర్మజ్ఞుఁ । డైనవాఁడు
వారియానతిఁ బాలింప।వలయుఁ గాదె. 954

గీ. అనుచితమొ లేక యుచితమో । యరయ నింక
నవసరము లేదు పెద్దల।యాజ్ఞ యట్టి

డైన మీహితబోధ నా యాత్మ కిపుడు
నచ్చకున్నది నాదువిన్నపము వినుఁడు. 955

ఉ. ఉత్తమరాజనీతుల హితోక్తులఁ బల్కిన మి మ్మదిర్చి ప్ర
త్యుత్తర మిచ్చుచుంటి నని యొప్పరికింపక యాలకింపుఁ డే
నిత్తఱి నేమి సేఁతువలె నేగె వనంబున కగ్రజుండు లో
కోత్తరుఁ డాపయిన్ సుతవియోగమునన్ దివి కేగెఁ దండ్రియున్.

గీ. రాజ్యమున కర్హుఁ డైనట్టి రాఘవుండు
విపినమున నుండ, రాజుఁ గావించి నన్నుఁ
బ్రోత్సహించెద రే నెట్లు లుత్సహింతు
రామచంద్రుండు లేని సామ్రాజ్య మేల? 957

సీ. రామచంద్రుఁడు లేని రాజ్యంబు రాజ్యమే
అది బూదెఁ బోయునాజ్యంబగాక
భోగితల్పుఁడు లేని భోగంబు భోగమే
కడఁజూడరాని రోగంబగాక
జానకీపతి లేని స్థానంబు స్థానమే
నక్క లుండెడుశ్మశానంబగాక
భువనకర్తుఁడు లేని భవనంబు భవనమే
భావింప నిర్జనవనముగాక

గీ. రామపాదారవిందమరందధార
స్నానముం జేయ జాలిన సజ్జనుండు
ఘనత కెక్కను రాజశేఖరుఁ డనంగ,
శ్రేయ మున్నదె శ్రీరామసేవకంటె. 858

ఉ. రామునిసేవకంటె నితరం బది స్వర్గమయేని మోక్షమేన్
నామన మించుకంతయు ఘనం బని యెంచదు నిక్కవంబుగా

నో మునివర్య! ఘోరవిపినోర్వికి నేగిన రామునిన్ బరం
ధాముని, శౌర్యధైర్యగుణధాముని జూచెద సమ్మతింపరే.
శా. నాతండ్రిన్ మఱపించి నన్నుఁ గరుణన్ లాలించి పాలించి సం
ప్రీతిం జూచెడు జ్యేష్ఠసోదరుని పృథ్విన్ నేను గైకొందునే?
సీతాలక్ష్మణ సేవితాంఘ్రియుగళున్ శ్రీరాము దర్శింప మ
చ్చేతం బెంతయుఁ గోరుచున్నది మదిన్ జింతింప నిం కేటికిన్?
గీ. మానసంతుష్టార్థ మంబరము లేని
నగ్నున కనర్ఘ్యమణిభూషణంబు లేల?
రమ్యవిజ్ఞానహీనవై రాగ్య మేల?
రామచంద్రుండు లేని సామ్రాజ్య మేల? 961
గీ. భక్తి యిసుమంతయును లేని వ్రతము లేల?
రోగభూయిష్ఠునకు భాగ్యభోగ మేల?
నయనహీనునకున్ దర్పణంబు నేల?
రామచంద్రుండు లేని సామ్రాజ్య మేల? 962
గీ. రామచంద్రుండు లేని సామ్రాజమునను
సకలసంపద లున్నను సౌఖ్య మున్నె?
అకట! జీవంబు లేని దేహంబునందు
నవయవము లున్న నేమి సౌఖ్యంబు గలదె? 963
గీ. మీరు వాత్సల్యమున నన్ను మేదినీశు
జేయఁ దలఁచిరి పౌరులక్షేమమునకు
జ్యేష్ఠరాజ్యంబు హరియించి సిగ్గుమాలి
ఎట్లు పాలింతు ధర్మజ్ఞు లేవగింప. 964
గీ. నేను గైకేయికొమరుండ నీచమతిని
అధమునకు రాజ్య మీయంగ నర్హ మగునె?

నిజకులాభిజనాచార।నియతిఁ గన్న
ధార్మికుఁడు నీతికుశలుండు । దగునుగాక. 965

గీ. మానహీనుఁడఁ బాపసం।భవుఁడ, నాకుఁ
బట్టముం గట్టఁ దలపెట్ట । వచ్చునొక్కొ ?
రామచంద్రుని దర్శింప । నామనంబు
తత్తఱముఁ బొందుచున్నది । తాల్మిఁ దక్కి. 966

మ. మునులుం దేవతలు న్మహర్షివరులు । న్మోక్షంబుఁగాంక్షించి యె
వ్వనిపాదాబ్జమరందపాననిరతిన్ । వ్యామోహముం జంపి, పా
వననామంబు జపించుచుందు రతనిన్ । వర్ణించి భోగింతువే
మనమా! దేహము శాశ్వతంబె వినుమా!।మా రాము సేవింపుమా.

మ. జననాథుల్ భువి లేరొ భోగపరులై । శాసింపరో రాజ్యముం
మునులు న్మేలని సన్నుతింపఁగఁ దుది । న్మోక్షంబుఁ గాంక్షింపరో
యని వాదించెద వేమొ? జ్యేష్ఠునకు న।ర్హం బెందు సామ్రాజ్య మో
మనమా! రాజ్యముఁ గోర రాదు వినుమా!।మా రాము సేవింపుమా.

మ. జనకున్ మాటల మోసపుచ్చి, వసుధన్।శాసింప నాసించి, యా
తనిజీవంబు హరించి, జ్యేష్ఠసుతుఁ గాం।తారంబునం బెట్టి నా
జననిన్ దేవతగా భ్రమించెద వె? సం।సారంబు నిస్సార మో
మనమా! యాశకు లొంగరాదు వినుమా!।మా రాము సేవింపుమా.

మ. తనయుం డంచును దల్లిదండ్రులు, జను। ల్ధాత్రీశ్వరుం డంచుఁ, బా
వనుఁ డంచు న్మునుఁ డంచు బ్రాహ్మణులు, స।ద్భక్తుల్ శివుం డంచు నె
వ్వనినామంబు స్మరించుచుందు రతనిన్ । భావింపుమా నిత్యమున్
మనమా! మాయకుఁ జిక్కరాదు వినుమా।మా రాము సేవింపుమా.

మ. దనుజుల్ కొంద ఱధర్మకర్మపరులై । ధాత్రిన్ విజృంభింప, యా
తన సైరింపఁగలేక లోక మడలన్ । ధర్మానవార్థంబు భూ

జనులకు గారణజన్ముడై వెలసి సాక్షాద్విష్ణు వీరాముడై
మనమా! ధర్మపథంబుఁబట్టి చనుమా । మా రాము సేవింపుమా.

మ. జననాథుల్ బలవంతులై స్థిరములైశ్వర్యంబులన్ భావనన్
కనకాంగీకనకంబులన్ మఱిగి రొక్కండైనఁ గొంపోయెనే
తనలో రాజ్యము, లేక కాలయమునిన్ । దండించి జీవించెనే ?
మనమా శాశ్వత మింకనైన మనమా । మా రాము సేవింపుమా.

మ. జనుఁ డెవ్వండు దరిద్రుఁ డెవ్వఁడు మహాసంపన్నుఁ డే వేళకేన్
దినిని జీవింపని వాఁ డెవండు, మతిఁ దృప్తిన్ బొందువాఁడే క్షితిన్
ధనికుం డంచు నెఱుంగుమా, సిరికి సంతాపించు టే సౌఖ్యమా
మనమా, భోగవిలాసముల్ విడువుమా । మా రాము సేవింపుమా.

ఉ. "ఎట్టులో రాజ్యము న్బైకు గ్రహింపవుమూఢు డ"వంచుఁ బల్కెదేన్
బుట్టుకతోడ భాగ్యముల । భోగములన్ గొనివచ్చితే, సిరిన్
గిట్టినవేళఁ జేకొని సుఖింతువె స్వర్గపురంబునందు? నీ
కట్టివిచార మేల? మనమా! రఘురాముని నాశ్రయింపుమా".

మ. అని యిట్లాభరతుండు ధర్మనిరతుం । డాత్మోపదేశంబునన్
దనదీక్షన్ బ్రకటింప రాజసభలోఁ । దద్ధర్మవాక్యంబులన్
విని శిష్టుండు వసిష్ఠుఁ డాత్మ నలరెన్ । పృథ్వీసురుల్ మెచ్చి హె
చ్చినభక్తిన్ గడు నుత్సహించి రనఘన్ । శ్రీరాము దర్శింపఁగన్

సీ. పౌరవరులు ప్రేమామృతవర్షధార
స్నానమాడినచందాన । సంతసించి
భరతు వీక్షించి శ్రీరామభక్తితోడఁ
బ్రేమ మీరీతి మూర్తీభవించె ననిరి. 97(

ఉ. గారుడమంత్రముగ్రతర కాలభుజంగవిషంబుఁ బాపు న
ట్లారఘురామచంద్రు విరహం బనుఘోరవిషంబుఁ బాపి యూ

పౌరుల నెల్లరకు భరతువాగమృతంబు సుఖాబ్ధిఁ దేల్చె, సీ
తారమణీమణీవిభునితమ్ముఁడుఁ దప్పునె ధర్మపద్ధతిన్.

గీ. అంతట వసిష్ఠుఁ డెల్లరు నా ననంగ
భరతునిభుజంబులం దట్టి పలికె నిట్లు
"ధర్మమూర్తివి నీయందుఁ దప్పు లున్న
ధర్మ మెఱిఁగినధన్యుఁ డీధరణిఁ గలఁడె? 978

ఉ. పామరుఁ డౌనె యర్కకులపావనుఁడై జనియించువాఁడు, ని
న్నేమని సన్నుతింతు, నెవఁ డేమని నిన్నుఁ దృణీకరించు? శ్రీ
రాముని కీవు నిక్కముగఁ బ్రాణసమానుఁడ వౌదు, నిన్ను ని
ష్కాముని నిందఁ జేసి నరకంబున నుండ నెవండు పాల్పడున్.

గీ. మంథరయుఁ గైక పన్నినమాయయందు
లేశమాత్రయు భాగంబు లేదు నీకు,
చెలఁగి యెవఁడేని నిన్ను దూషించెనేని
ఘోరనరకకూపంబునఁ గూలుఁగాక. 820

గీ. ఫణిఫణామండలంబున మణి రహించు;
మణికి ఫణికృతకర్మసంబంధ మున్నె ?
మీఁదుమిక్కిలి జనులకు మేలొనర్చు
గరళజనితాగ్నిఁ జల్లార్చుఁ గలిమిఁ గూర్చు. 981

గీ. రామవిరహాంబునిధిమగ్నమైన మదీయ
మానసంబు కర్తవ్యంబు మఱచెఁగాక;
ఈ వనినయట్లు మన మిప్పుడేగఁ దగును
రామసందర్శనార్థ మరణ్యమునకు". 982

గీ. అనిన విని మేలు మే లని మునివరేణ్యు
పలుకులకు సంతసించిరి పౌరవరులు;

జలదగర్జన మాలించి । చాతకములు
సంతసించినసరణి నా।సమయమునను. 983

శా. "ప్రాతఃకాలమునందు యెల్లరు మహా।రణ్యంబునం దున్న శ్రీ
సీతారాముల లక్ష్మణుఁ మునుల ద।ర్శింపంగ నౌ నంచు" ని
ర్ణీతైకాశయు లై గృహాభిముఖు లై । ప్రేమామృతస్నాతు లై
ప్రీతిం బొంది వనప్రయాణనిరతిఁ । వేగించి రారాత్రిఁ. 984

గీ. వేగనో లేదొ పౌరులు । విప్రవరులు
దాశరథిఁ జూడవలె నంచుఁ । దత్తరిలిరి
భరతుఁ డంతట మంత్రిశే।ఖరులఁ బిల్చి
ఎల్లపౌరులముందఱ । నిట్టు లనియె. 985

గీ. "సేకరింపుఁడు పట్టాభి।షేకమునకు
వలయుసంభారముల, మునీ।శ్వరులనుమ
మునివరుండు వసిష్ఠుండు । వనమునందు
పట్టముం గట్టు నినకుల।భాస్కరునకు." 986

చ. కరితురగాదివాహనని।కాయముతోడ నమాత్యశేఖరుల్
భరతునియాజ్ఞ వేగముగ । వచ్చినయంత వసిష్ఠమౌని యా
తురత నిజాగ్నిహోత్రముల।తో సతితోఁ రథమెక్కెఁ దొల్త, భూ
సురులును పౌరులుం బిదప । సూరులు నెక్కిరి వాహనంబులన్.

గీ. అనుజుతోడ నంతఃపురాం।గనలతోడఁ
బౌరముఖ్యులతోడ న।బ్బరతుఁ డపుడు
జానకీరామచరణాంబు।జములఁ దలఁచి
వెడలెఁ బరివార మంతయు । వెంబడింప. 988

గీ. తృష్ణ గలిగినగజముల।రీతిఁ దోఁప
[illegible] । [illegible]

శృంగిబేరపురంబును । జేరి రంత
నాగుహుండు కోలాహలం । బాలకించి. 989

చ. "కరితురగాదివాహనని । కాయసమావృత మైనసేనతో
భరతుఁడు క్రోధి యైకపట । భావమునన్ వడి నేగుదెంచెనో?
అరయఁగఁ గాననున్న తన । యన్నఁగనుంగొనవచ్చె నేని, సం
గరమున కగ్ర మహాభటని । కాయముతో వెడలంగ నేటికిన్? 990

గీ. జానకీరామలక్ష్మణుల్ । చచ్చిరేని
కైకయానతి నింక ని । ష్కంటకముగను
వసుధఁ బాలింప నగునని । వచ్చె నేమొ?
రాముని జయింప శక్యంబె । బ్రహ్మకైన. 991

గీ. ఇతఁడు శ్రీరామువధియింప । నేగుదెంచెఁ;
గైక యనుఘోరరాక్షసి । గర్భమునను
ఉత్తముం డగు సుతుఁడెట్టు । లుద్భవించు
విషలత నమృతఫల ముద్భ । వించునొక్కొ? 992

శా. భ్రాతృప్రేమ వహించి, మాభరతుఁడే । పాలింపుఁగా కంచుఁ దా
సీతన్ లక్ష్మణుఁ గూడి కాన కరిగెన్ । శ్రీరాముఁ డూహింపఁగా
నేత న్మాతృఁడె? యట్టివాని నకటా । యాతండు భజించునే?
"జ్ఞాతిచ్ఛేదనలేనకిమ్మునుడిన్ । సత్యంబుగా నెంచెనో? 993

క. అనుమానము పెనుభూతము
మనమునఁ గలసందియంబు । మరలఁగ నిపుడేఁ
జని యభ్భరతుని నడిగెద"
నని యెంచి నిషాదనాథుఁ । డచటికి వెడలెన్. 994

గీ. వెడలి మునివసిష్ఠునిఁ గని । వినతుఁ డగుచుఁ
జేతులన్ మోడ్చి, నాతఁ డా । శీర్వదించి

"భరత ! చూచితె శ్రీరామ । భక్తుఁ డీతఁ
డనుచుఁ బరిచయ మొనరించి । యాదరించె. 995

చ. భరతుఁడు స్యందనంబు డిగి । "భక్తవరా"యని కౌఁగిలించి, ప్రే
మరసపయోధి నగ్గుహుని । మగ్నునిఁ జేసిన యంతఁ, బౌరు లె
ల్లరుఁ గని, "యౌర ! భూవరల । లాముఁ డనంగఁ బ్రసిద్ధిఁ గన్న మా
భరతుని యాదరంబునకుఁ । బాత్రుఁడె యీగుహుఁ డెంతధన్యుఁడో

గీ. రామనామంబుఁ దలఁచుమా । త్రమున నెట్టి
పామరుం డైన నఖిలపా । పములు దొలఁగి
పావనుం డగు గౌరవ । పాత్రుఁ డగును
సందియం బొందఁదగ దింక । సజ్జనులకు. 997

ఉ. పావనరామనామము వి । పర్యయరీతి జపించుగాక యే
జీవియు నెట్టిపాపములఁ । జెందక మోక్షముఁ బొందు; దొంగలై
త్రోవలనక్కియుండు శబ । రుల్ శ్వపచుల్ యవనుల్ కిరాతు లీ
పావననామమంత్రము ప్ర । భావమునన్ భవమున్ తరింప నౌ. 998

గీ. అనుచుఁ బౌరులు తమ తమ । యాత్మ లందు
సంతసింపఁగ నంత ని । షాదనాథుఁ
భరతుఁడు నుతింప, నానంద । భరితుఁ డగుచు
గుహుఁడు చేతులన్ మోడ్చి సం । కోచ ముడిగి. 999

గీ. "స్వామి ! నీపాదములు పాప । శైలవజ్ర
సాయకము లాశ్రితక్షేమ । దాయకములు
ధన్యతముఁ డను నీదుస । దర్శనమునఁ
బావనం బయ్యె నేను నా । జీవనంబు. 1000

గీ: సంశయాత్ముండ నీమంద । జడుఁడ ఖలుఁడ
నీవు మహిమాన్వితుండవు । నిక్కువముగ

రామచరణారవింద మ।రందపాన
మత్తచిత్తుండ వెంతయు । నుత్తముండవు. 1001
వేదబాహ్యుండ దుష్టుండఁ । బిఱికిపంద
నైన శ్రీరామకరుణాక।టాక్షమునకుఁ
నేను బాత్రుండ నైతి న।హీనచరిత
భరత! నీదర్శనమునఁ బా।వనుండ నైతి." 1002
అనుచు వినుతించి దరహాసి।తాస్యుఁ డగుచు
మౌనివరునకు నెలమి న।మస్కరించి
అచటఁ గలవారు లెల్లరు । నభినుతింపఁ
దనదుపరివారముం గూడి । చనియెఁ బురికి. 1003
భరతుఁ డంతట గంగాస్ర।వంతిఁ గాంచి
ఘనుఁడు రాముండు మునిఁగిన । ఘట్టమునకు
మునివరునితోడఁ బరివార।జనముతోడ
సత్వరంబుగఁ జని యందు । స్నానమాడి. 1004
కలుషము లడంచు తల్లి! గం।గామతల్లి!
భక్తజనకల్పవల్లి! శ్రీ।వరుని నెల్లి
జూడ జోయెద నను దయఁ । జూడు మమ్మ
అనుచు బ్రణమిల్లి యెంతయుఁ । దనివిఁబొంది. 1005
పిదప, శ్రీరామచంద్రుండు । వెడలి వెడలి
విశ్రమించిన శింశుపా।వృక్షముఁ గని
అతఁడు శయనించినట్టి శ।య్యను నుతించి
మఱియు దుఃఖించె జానకిన్ । మదిఁ దలంచి. 1006

"అకటా! యెట్లుసహింతు, జానకి, యసూ।ర్యంపస్య; యేరీతి నా
సుకుమారాంగన యోర్చె నిట్టియడవిన్? । శోకించెనో? యెంచెనో

వికటించెన్ విధియంచు? నన్ను ఘటనన్ ద్వేషించి దూషించెనో?
సకలైశ్వర్యము నాశ మయ్యెననుచున్ సంతాపముం బొందెనో?

గీ. పుణ్యతముఁ డగు జనకుని పుత్రియయ్యుఁ
గొదవమొదవని దశరథు కోడలయ్యు
రామచంద్రుని ప్రేమాభిరామ యయ్యు
నకట! యిడుమలపా లయ్యె నవనిజాత. 1003

గీ. తల్లి నెడఁబాసి కలసంపదలను రోసి
సీతకున్ రామునకుఁ బాదసేవఁజేసి
అఖిలకల్యాణగుణమాన్యుఁ డైరహించె
లక్షితసులక్షణుండు మా లక్ష్మణుండు. 1009

గీ. ధరణిఁ గలజీవులకు సుఖదాయకముగ
నాదినారాయణుం డిట్టు లవతరించె
ననుచు నెవ్వాని దైవజ్ఞు లభినుతింతు
రట్టి రాముని సుగుణంబు లగణితములు. 1010

ఉ. ఆతని మిష్టభాషణము నాతని సత్సరళస్వభావమున్
ఆతని సుప్రసన్నదరహాసముఖాబ్జము శ్రీనిశాంతమా
నాతని సాహసంబుఁ జతురాననుఁడున్ నుతియింపనోపఁ డీ
భూతలమందు రాఘవునిఁ బోలినభూపుఁడు మున్ను పుట్టెనే.? 1011

గీ. ఘనుఁడు సర్వజీవులకు సుఖస్వరూపుఁ
డెన్నఁడున్ దుఃఖ మెఱుఁగని యిద్ధచరితుఁ
డతనివర్ణింపగా సరస్వతికి నైన
నాదిశేషున కైన శక్యంబు గాదు. 1012

సీ. మిత్రు లెల్లరు వినిమించిన మిత్రుండు
మేదినిలేఁ డన మెలఁగువాఁడు

అరిశోక మితఁడు మహాకాలుఁ డంచుఁ ద
లంచునట్లు పరాక్రమించువాఁడు
తత్త్వజ్ఞులీతని తత్త్వంబు గ్రహియింప
రాదంచుభావింపఁ గ్రాలువాఁడు
నీతిజ్ఞులీతండు నీతికి నిధి యని
వర్ణించి వినుతింప వఱలువాఁడు

గీ. ఆదినారాయణుం డిట్టు లవతరించె
ననుచు నూహింప విష్ణ్వంశ నలరువాఁడు
సూర్యవంశాంబునిధి పూర్ణసోముఁ డైన
రామచంద్రుండు లోకాభిరాముఁ డహహ. 1013

చం. విసిచెఱువాఁడు కాఁడు పృథివీపవరుఁ డెన్నఁడుఁ నీవు కూడికన్
దపఁబడుఁ దల్లిసిఁ ఋణముదాకఁ గ్రనుంగొనకుండ నేసి; గా
రడమునుబన్ని తండ్రిని వరంబులఁ దెమ్మని కోరె కైక ని
న్నడవుల పాలొనర్చె నహహ రఘునాయక! మోక్షదాయకా.

గీ. అనుమఁ బరిపరివిధముల నాత్మఁదలఁచి
ఇంతటియనర్థమున కేద హేతు వనుచుఁ
బరమపాపాత్ముఁ డనయంచుఁ బరితపించి
అతఁడు చనియె వేగముగఁ బ్రయాగమునకు. 1015

మ. మునివర్యుల్ పరిచారకుల్ సఖులు విప్రుల్ పౌరు లాసక్తితోఁ
దన వెంటన్ జనుదేర, నబ్బరతుఁ డుత్సాహంబు దీపింపఁగన్
వినతిన్ బాపలతాలవిత్రముఁ ద్రివేణీసంగమక్షేత్రమున్
బ్రణుతించెన్ రఘురాముచేఁ గనుఁ బవిత్రంబయ్యె నం చెంచుచున్.

"ఉ. విప్రులు నీపవిత్రభావమును వేదములున్ వినుతించునండ్రు, మో
క్షప్రదపుణ్యతీర్థ మని సర్వమునుల్ భజియింత్రు నిన్ను, భ

క్షితిపాలనంబునను । ఖ్యాతివహించితి పితరిత్రి నా
హా! ప్రణతాఖిలాశ్రితజ।నామరభూజమ! తీర్థరాజమా! 1017

గీ. అఖిలకామప్రదాయిని । వగుదు వీవు
క్షత్రియుఁడ నయ్యు నకట సం।క్షోభంబుతోడ
నిన్ను యాచింపవచ్చితి । నితరదక్కి;
దోసమున కేమిసేయుదు । దుఃఖితుండ? 1018

గీ. దానశీలు రర్థులకామి।తముల నెల్ల
సఫలముం జేయువారు ని।స్సంశయముగ
సకలధర్మార్థకామమో।క్షములఁ గోరి
నిన్ను యాచింప రాలేదు । నిక్కువముగ. 1019

గీ. జానకీరామచరణాంబు।జములయందుఁ
బ్రీతియున్ భక్తి నాకుఁ బ్రా।ప్తించుఁ గాక
లోక మేరీతిఁ దలఁచినన్ । లోపముండ
దతనిభజియించి సేవించు । ననఘుమతికి. 1020

గీ. జన్మజన్మాంతరముల కేన్ । జలజనేత్రు
కూడికయు భూరిదయయుఁ జే।కూరుఁగాక
చాతకపిపాస వారించు । జలద మట్లు
భక్తులయభీష్టముం దీర్ప।వలయు నీవు. 1021

గీ. వహ్నిసంతప్తకనకంబు । వన్నెఁ గాంచు
నాపదల కోర్చి సద్భక్తుఁ । డతిశయించు;
సైఁపనోపుదు నెన్నికష్టముల నైన
రామునివియోగమున నేను । బ్రదుకఁజాల." 1022

గీ. అనుచు నీరీతిఁ బ్రార్థించి । యాస్థలంబుఁ
బాసి వేవేగచని భర।ద్వాజుఁ గాంచి

శీర్షమున్ వంచె, నాతఁ డా।శీర్వదించి
ఎలమి రమ్మని భరతుతోఁ। బలికె నిట్లు. 1023

ఉ. "వత్స! భవత్సమాగమన।వార్త నొకించుక యాలకించి, నే
త్రోత్సవ మౌ నటంచుఁ దడ। వోరిచి చూచుచునుంటి; నీమతిన్
కుత్సితవృత్తి లేదని, ర।ఘుప్రవరుం డగు రాముఁడే భవత్
హృత్సరసీజభృంగ మని। యేనుగ్రహించితి దివ్యదృష్టిచే. 1024

గీ. మందరయుఁ గైక మాయలం। బన్ని రనుచు
వారలన్ దిట్టి కొట్టిన। ఫలము గలదె?
దైవికమహేతు వీయన।ర్థముల కింక
వగవవచ్చునె విధికర్మ।పాకమునకు. 1025

గీ. జనకుఁ డెవనికి రాజ్య మొ।సంగు నతఁడ
యవనిఁ బాలింప నర్హుఁ డౌ।నంచు సర్వ
శాస్త్రములుఁ జెప్పుచున్నవి, । జనకునాజ్ఞ
నౌదలం దాల్పఁ దగు నీకు। ననఘచరిత! 1026

చం. సకలజనాభిరాముఁ డని। సాధుమునీశ్వరసన్నుతప్రవ
ర్తకుఁ డని ఖ్యాతిఁ గొన్న రఘు।రాము నరణ్యనివాస మెన్నఁగన్
ప్రకృత మనర్థహేతు వని। పల్కెదవేన్, మునుమున్న కీర్తిదా
యక మగు సర్వదానవకు।లాంతక మౌ నది విశ్వసింపుమా.

ఉ. ఇప్పుగిదిన్ వనంబునకు। నీ వరుదెంచుట నిక్కువంబుగాఁ
జెప్పెదఁ జాలమంచిపని। చేసితి వన్యుఁ డెవండొ నీయెడన్
దప్పుగణించుఁ గాక, వసు।ధాసుతయున్ రఘురామచంద్రుఁడున్
దప్పని దెప్పవారె కుల।ధర్మముఁ దప్పని నీవు నైజమున్. 1028

గీ. జానకీరామపాద।దర్శనము సర్వ
మంగళప్రద మంచు నె।మ్మదిఁ దలంచు

మతఁడె జీవన సర్వస్వ । మనుచు నెంచు
భక్తవరుఁడవు నీకు లో।పంబు గలదె? 1029

గీ. వత్స! యాలింపుమా రామ।భక్తిరసము
పృథివి భరతుఁడై మూర్తీభ।వించెఁ జూవె;
రామభక్తియె ప్రాజ్య సా।మ్రాజ్య మనుచు
నెంచి మము మించి సుకృత మా।ర్జించి తీవు. 1030

సీ. సంసార మనునాక।సంబున సతతంబు
రాముఁడన్ సూర్యుండు । గ్రాలుచుండ
నతని తేజముఁ గన్న । యమృతాంశుఁడవు నీవు
సద్యశశ్చంద్రికన్ । జల్లుచుండు
వస్తమింపవు సంత । తాభ్యుదయంబున
నతనిభక్తచకోర।వితతి నేలి
నిష్కళంకంబుగ । నెగడెదు; గురువును
వచించుదోషంబుఁ । బడయ వెపుడు

గీ. రాము ప్రేమామృతంబు ని।న్నోముచుండ,
మంథరయుఁ గైక పన్నిన । మాయ యనెడు
రాహు వేరీతి మ్రింగు? సం।దేహ మేల?
విబుధబృందంబుఁ దనియించి । వెలుఁగఁ గలవు. 1031

గీ. తపముఁ గావించి శశికళా।ధరునికృపను
పతితపావని గంగాస్ర।వంతిఁ దెచ్చె
మీకులంబునఁ బుట్టి సు।శ్లోకుఁ డయ్యెఁ,
గీర్తితమనోరథుండు భ।గీరథుండు. 1032

గీ. ఎవని పదపద్మమకరంద । మవని సర్వ
జీవులకు జీవనం బట్టి । శ్రీనివాసు

నవతరింపఁగఁ జేసె ని।జాన్వయమున;
దశరథునిఁ బోలఁజాలు । భూధవుఁడుగలఁడె? 1033

చ. ఎవనిపవిత్రనామము మ।హేశుఁడు సంతతమున్ స్మరించునో
ఎవని మునీశ్వరుల్ గుణము । లెంచి నుతింతురో, యట్టి జానకీ
ధవుఁడు భవత్కులాంబుధిసు।ధాకరుఁ డైజనియించి సర్వభూ
ధవులను ఖ్యాతికెక్కె, భువి । ధన్యతముండవు నీవ భూవరా!

గీ. రామచంద్రుండు నీకు న।గ్రజుఁడు కాఁగ
లోప ముండునె? యింక సం।తాప మేల?
పసుస వేదినిఁ బొందియు । సిరులఁబడయ
సందియం బొంద నేటికి । జనవరేణ్య? 1035

గీ. ఒకనిఘనతను బొగడ వే।ఱొకనిఁ దెగడ
నవసరములే దుదాసీను । లైన మునుల
కనఘ ! శ్రీరామదర్శన।ప్రాప్తివలన
శాశ్వతఫలంబుఁ గాంచె మా।జపము తపము. 1036

సీ. జనకభూవరసుతా।సౌభాగ్యమంత్రంబు
విశ్వవిఖ్యాతప।విత్రమంత్ర
మంభోజసంభవా।ద్యమరోక్తమంత్రంబు
శితికంఠపూజిత।సిద్ధమంత్ర
మరివర్గసంహార।కరఘోరమంత్రంబు
భవసాగరోత్తార।భవ్యమంత్ర
మఖిలమానవజన్మ।సార్థకమంత్రంబు
వేదవేదాంతైక।వేద్యమంత్ర

గీ. మతులదారిద్ర్యరోగభ।యహరమంత్ర
మార్యమునివర్యసన్నుతౌ।దార్యమంత్ర

మాయురారోగ్యభాగ్యాప్రమేయమంత్ర
మమృతమయరామనామమంత్రము దలంప. 1037

ఉ. దోసిలి యొగ్గి యంత భరతుండు మునీంద్రునిఁ జూచి "నీయుప
న్యాసమునన్ మదీయహృదయాంతరసంశయ మంతరించె, సం
తోషము మేర మీఱె, నను దోషిగ నెంచి జగంబు నాయెడన్
దోసము లెంచినన్ సుచరితుండు రఘూద్వహుఁ డాలకించునే?

గీ. అనుచు వచియించి యానంద మతిశయింప
జానకీరామచంద్రుల సంస్మరించి
పులకితశరీరుఁడై బాష్పములఁ ద్యజించి
పలికె నీరీతి గద్గదస్వరము గదుర. 1039

గీ. అనఘ! సర్వజ్ఞుఁడవు రాముఁ డనఁగ నెవఁడొ
లో నెఱింగినయట్టివిజ్ఞాని వీవు;
జనని పన్నినకౌటిల్యమునకుఁ గుంద;
బరులనిందకు సుంతయుఁ బరితపింప. 1040

గీ. పుణ్యపురుషులు సత్కీర్తిమూర్తులైన
రామలక్ష్మణులంగాంచి రాజవరుఁడు
ధన్యుఁడై కీర్తిశేషుఁడై ధరణి విడిచె
నిపుడు నే విచారించిన నేమిఫలము? 1041

చ. కరుణదొఱంగి తల్లి యగు కైక విధించినయట్టిశిక్షకున్.
బురమును బాసి భాగ్యమును భోగవిలాసములన్ ద్యజించి, ము
గ్గురును ఫలంబులన్ దినుచు ఘోరవనంబునఁ బాదచారులై
తిరుగుచునున్నవా రని మదిన్ గడుఁగుందెదఁ దాపసోత్తమా!

ఉ. సీతక్షుధార్తితోఁ దనుభజింపఁగఁ, దమ్ముఁడుఁ సేవఁ జేయ, శీ
తాతపవర్షబాధకు రవంతయు జంకక, దర్భశయ్యపై

భూతలమందు వృక్షములపొంతఁ బరుండు రాముఁ జూడ, మ
చ్చేతము తల్లడిల్లు మునిశేఖర సన్నుత సోమశేఖరా! 1043

గీ. ఆఁకలి యెఱుంగ నిద్ర సుంతైన నెఱుఁగ
రామవిరహంబుచే నిట్టి యామయంబు
సంభవించెను నేఁటి కసాధ్యముగను
జగతియంతయుఁ దోఁచె నిస్సారమట్లు. 1044

గీ. అనినఁ జిఱునవ్వు నవ్వి యమ్మునివరుండు
"వత్స! యాలింపు మిట్టియాపత్సమయము
నందు ధైర్యంబు స్థైర్యంబుఁ బొందవలయు
రామసందర్శనంబున క్షేమ మగును". 1045

గీ, అనుచు నాశీర్వదించిన నమ్మునీంద్రు
సన్నుతించుచు భరతుఁ డాస్థలముం బాసి
చిత్రకూటమార్గముఁ బట్టి శీఘ్రగతిని
జనియె శ్రీరామునిస్మరించుకొనుచు నపుడు. 1046

— దేవేంద్రుఁడు బృహస్పతితో మంతనములాడుట. —

చ. భరతుని రామభక్తిని బ్రభావముఁ గాంచి కడున్ భయంబునన్
సురవిభుఁ డాబృహస్పతినిఁ జూచి రహస్యముగా వచించె ని
"ట్లరసితె వీని ప్రేమము, మహామహుఁ డీతఁడు రామచంద్రునిన్
బురమున కెట్టులైనఁ గొనిపోవక మానఁ డుపాయ మున్నదే?"

ఉ. కొంపమునింగె నార్య! యదిగో భరతుండు దృఢప్రతిజ్ఞ దీ
పింపఁగ రామచంద్రుఁ బృథివీపతిఁ జేసెద నంచు వచ్చె, యో
చింపుము, రాముఁ డీతఁడు వచించిన కైవడి సమ్మతించునేన్
చంపెడువాఁ డెవండు మనశాత్రవులన్ దశకంధరాదులన్. 1048

చ. ఇరువురుఁ బ్రేమవారిధులు హీనచరిత్రులు; రామచంద్రునిన్
భరతుఁడు బాయఁ డెన్నఁడు, న పారకృపానిధి రాఘవుండు సో

దయవచనంబులన్ విని ముదంబును బొంది వసిష్ఠునానతిన్
బురమున కేఁగునే మొ, తల పోయు ముపాయ మపాయ ముండునే.

చ. అన విని దేవమంత్రి దరహాసము మోమున నంకురింప, వే
కనులనుగల్గియున్నఁ గనుగానఁడు నిర్జరనాథుఁ డంచు నె
మ్మనమున నెంచి యిట్లనియె మందమతిన్ విపరీతవైఖరిన్
మునుకొని యిత్తెఱిన్ కపటముల్ దలపెట్టిన హానిచేకుఱున్.

ఉ. మాయకధీశ్వరుం డయిన మాధవుఁ డీరఘురాముఁ డాదినా
రాయణుఁ డంచెఱుంగవొ, పరాత్పరుకన్నులఁ గప్పి వంచనన్
మాయలఁ బన్నశక్య మగునా? రఘురామునికంటికిన్ దృణ
ప్రాయముల మేమొనర్చిన నపాయము కాక యుపాయ ముండునే.

మ. తనునిందించిన యంతమాత్రమున సంతాపింపఁ డావంతయున్
దనభక్తున్ నిరసించినన్ గసరినన్ దండించి బాధించినన్
వనముల్ గాల్చుదవాగ్నిచందమునఁ గోపస్ఫూర్తి దీపించు న
య్యనవంశోత్తముఁ డైనరాఘవుఁడు; దేవేంద్రా విచారింపుమా.

గీ. రామున కనిష్టమైనకార్యము నొనర్చి
కోరి యాపదఁ బైబెట్టుకొనఁగనేల?
ఆతనిమహిమ వర్ణనాతీత మనుచు
నెఱిఁగె దూర్వాసమునివరుం డించుకంత. 1053

గీ. అంబరీషుని దూర్వాసుఁ డాగ్రహించి
కోరిబాధించెనని యెంచి కోపగించి
చక్రమున వానిగర్వంబుఁ జక్కఁజేసె
భక్తవర్యుల రక్షించుప్రభు వతండు. 1054

చ. భరతుఁడు రామచంద్రునకు భక్తవరుం డని లోనెఱుంగుమా!
పరమపవిత్రుఁ డైన తన భక్తునెడన్ గపటంబుఁ బన్నినన్

సరసిజనేత్రుఁ డట్టియప। చారము సైఁపఁడు, కీడుచూడు, దు
ర్భర మగు దుఃఖముల్ గలుగు। బాధలఁబొందెదు, దేవవల్లభా.

మ. రాజత్వంబు రహింప సర్వధరణీ। రాజ్యంబుఁ బాలింపఁగా
రాజీవాక్షులఁగూడి భోగపరుఁడై రంజిల్లఁగా నెంచి, యం
భోజాక్షుండు, గుణాభిరాముఁ డగు రా। ముం డిట్లు జన్మించెనే ?
తా జన్మించిన దేటికో మఱచెనే। తర్కింపుమా నెమ్మదిన్. 1056

సీ. పాపపుణ్యంబు లంటని। పావనుండు
జ్ఞాని, రాగంబు ద్వేషంబు। లేనివాఁడు
కర్మము ప్రధానముగఁ జేసి। కర్మసహిత
జీవులకుఁ దత్ఫలం బొందఁ। జేయువాఁడు. 1057

సకలసద్భక్త చిత్తంబు। లకు సముండు
నిఖలరిపులకు విషముండు। నిర్గుణుండు
ప్రేమవశమున సద్భక్త। వితతి నేల
సగుణుఁడై రామచంద్రుఁడు। జన్మ మొందె. 1058

ఉ. మానవనాథుఁ డయ్యు నభి। మానము సుంతయు లేనివాఁ డవా
ఙ్మానసగోచరుం డనుప। మానగుణావ్రతవర్తనంబునన్.
మానులసన్నుతిం బడసె; । మాధవుఁ డంచు దయాళుఁ డంచు, వి
జ్ఞానపయోధి యంచు నృప। సత్తములున్ వినుతింప రాజిలెన్.

ఆ. భక్తులకు సంరక్షకుఁడై। ప్రబలువాఁడు
పరహితంబును గాంక్షించు। ప్రభువరుండు
అమరకార్యార్థమై యాతఁ। డవతరించె
రామచంద్రుఁడు త్రిభువన। రక్షకుండు. 1060

తే. అని బృహస్పతి వచియింప। నమరవిభుఁడు
మేలుకొని మేలు మే లని। పూలవాన

భరతుపైఁ నంతఁ గురిపించి, భక్తితోడ
జానకీరామచంద్రుల సంస్మరించె. 1061

గీ. అంత భరతుండు చనుదెంచి యమునఁ గాంచి
రామచంద్రుని దేహవర్ణంబుఁ బోలు
శ్యామలజలంబుల మునింగి స్నానమాడి
యాత్మ దుఃఖించి తుదకు ధైర్యము వహించి. 1062

గీ. యమునయొద్దను రాముండు రమణితోడ
లక్ష్మణునితోడ మెలఁగు స్థలంబు లెల్లఁ
బావనము లంచు భావించి భక్తిగదుర
మ్రొక్కుచున్ మెల్లమెల్లఁగఁ బోవుచుండె. 1063

చ. "పరమకృపానిధీ! పతితపావననామ! జనాభిరామ! భా
స్కరకులవార్ధిసోమ! మునిసన్నుతసద్గుణధామ!" యంచు న
భ్భరతుఁడు పోవుచుండఁ గని పండెఁగదా మనపుణ్య మంచు స్త్రీ
పురుషులుమాది భక్తిమెయి మ్రొక్కి నుతించి రనేకభంగులన్.

గీ. ఊషరంబునఁ గల్పకం బుద్భవించి
నట్లు, మరుభూమికిన్ గంగ యరుగుదెంచి
నట్లు, పాదసూపె నేఁ డిమహానుభావుఁ
డనుచుఁ దలఁచిరి మఱికొంద ఱనఘు లచట. 1065

గీ. జానకిన్ రామచంద్రు లక్ష్మణునిఁ జూడ
వలయు ననుకుతూహలమున భరతుఁ డప్పు
డాత్మపరివార మంతయు ననుసరింపఁ
జిత్రకూటంబు వేవేగఁ జేరుకొనియె. 1066

ఉ. దారయుఁ దమ్ముఁడున్ దనపదంబులఁ గొల్చుచునుండఁగన్ నదీ
తీరకుటీరమందుఁ గల ధీరవరున్ రఘురామచంద్రునిన్

దూరమునుండిచూచి భర। తుండు కరంబుల మోడ్చి మ్రొక్కె; న
వ్వారిజగర్భుఁడున్ భరతు। భక్తివిరక్తి వచింపఁజాలునే? 1067

ఉ. అంతట రాముఁ డాత్మనిల।యంబున లక్ష్మణుతోడ "నిట్టి యే
కాంతనివాసయోగ్య మగు। కాననమే పరమార్థచింత క
త్యంతము సానుకూల మగు"। నంచు వచించుచునుండ స్వప్నవృ
త్తాంతముఁ జెప్పఁజొచ్చెను ని।తాంతభయంబున సీత యత్తఱిన్.

సీ. కల కల్లయగుఁగాక। కలఁగంటి వేకువ
జామునన్ దేఁకువ। సన్నగిల్లె
నత్తలందఱిరీతి। కొత్తగాఁ గనుపట్టె
విలపించు బాంధవ। వితతిఁ గంటిఁ
గలఁతచేఁ బురమునఁ। గలవారు లెల్లరు
నతిదుఃఖవివశు లై।నటులఁ గంటిఁ
బరివారసహితుఁ డై। భరతుండు, మునివర్యుఁ
డగువసిష్ఠుఁడు వచ్చి।నటులఁ గంటి

గీ. అనిన విని రాముఁ డప్రియ। మైనవార్త
మనము వినవచ్చునని సాధు।జనులఁ దలఁపి
స్నానముం జేసి పరమేశు। సంస్మరించి
భయమువల దంచు ధైర్యంబుఁ। బాదుకొల్పి. 1069

గీ. ఉత్తరపుదిక్కునందు వి।యత్తలంబు
ధూళిసచ్ఛన్న మగుట నా।తురతతోడ
ఖగమృగంబులుఁ బఱచుటఁ। గాంచి యేమి
హేతువో యని యాత్మనూ।హించుచుండ. 1070

కం. అత్తఱిఁ గిరాతు లెల్లరుఁ
దత్తరమున నేగుదెంచి। తమ్ముఁడు మమ్మా

బుత్తెంచె ననుచు యావ
ద్వృత్తాంతముఁదెలియఁజేసి । వెడలిన యంతన్. 1071

కం. పరివారసహితముగ న
ద్భరతుం డేతెంచె నన్న । వార్తను విని భా
స్కరవంశపయోధిసుధా
కరుఁ డగు రాముఁడు పులకిత । గాత్రుం డయ్యెన్ 1072

గీ. అపుడు రాముండు లక్ష్మణుం । డాలకింప
"భరతుఁ డీరీతిఁ జతురంగ । బలముతోడ
రాఁ గతం బేమి యనినంత । రాముఁజూచి
వినతుఁడై లక్ష్మణుం డిట్టు । లనియె నెలమి. 1073

గీ. భరతుఁ డేకాకియై రాక । బలముతోడ
నేటి కేతెంచెనో మన । మెఱుఁగవలయుఁ
ప్రభువరుండవు నీవు సే । వకుఁడ నేను
నీకు బోధింపఁ గలశక్తి నాకుఁ గలదె? 1074

చ. సమయముఁజూచి సేవకుఁడు । స్వామిహితంబునుగోరి సత్యమున్
సముఖమునన్ వచించుటకుఁ । జాలినవాఁ డగునేని ధన్యుఁడౌ;
సుమతివి, నీకు నాపలుకు । క్షుద్రముగాఁ గనుపట్టవచ్చు, న
క్రమమొ క్రమంబొ, లోనరయు । గాఁ దగు నిత్తఱి నీతికోవిదుల్.

ఉ. శాసనకర్త వీవు ప్రకృతి । సర్వమెఱింగిన యట్టిచిత్కళా
భ్యాసివి, నీవు సేవకుల । భక్తులచిత్తములం గలట్టి వి
శ్వాసము భక్తియున్ దెలియ । జాలుదు వే నొకనీతివాక్యమున్
నీసముఖంబునం దెలుప । నేర్పరినే రఘువంశనాయకా! 1076

గీ. విషయవాసన గలజీవి । పృథివియందు
సంపదలఁగాంచినంత, నజ్ఞానియగును

దురభిమాని యై మూర్ఖుఁ డై । దోషములకు
నాస్పదుం డయి చెడు నందు । రనఘచరిత. 1077

చం. భరతుఁడు బుద్ధిమంతుఁడు, భ।వత్పదభక్తుఁడు, నీతికోవిదుం
డరయఁగ సజ్జనుండు నగు । నైన వచించెద, నేఁడు కైకకున్
ధరణి లభించె, రాజ్యమ।దంబున నుంతయుఁ గన్నుఁ గానఁ డీ
తరుణము నిన్ను నన్ను మఱి । ధర్మపథంబును జూడనిచ్చునే?.

ఉ. అక్కట!! చెప్ప కేమి? చతు।రంగబలంబును గూడి, చుట్టముఁ
బక్కముఁ జూడకుండ, మన।పక్కణసీమను దాఁటి, కానకుఁ
జిక్కిన నీవు నేను నవ।శిష్టవిరోధులుగాఁ దలంచి, యీ
టక్కరి యేగుదెంచెఁ గప।టంబున; రాఘవ! యాలకింపుమా!.

గీ. బలము లేక సహాయసం।పత్తి లేక
కాలవైపరీత్యమున ని।క్కాన నున్న
నిన్ను నన్ను నిర్బంధింప । నిశ్చయించి
భరతుఁ డేతెంచెఁ జతురంగ।బలముతోడ. 1080

గీ. వసుధ నిర్భయంబుగ నేల।వలయు ననుచు
రాజ్యమదమున మతిఁ దప్పి । రణముకొఱకుఁ
గపటభావంబునన్ వచ్చెఁ । గాక యితఁడు,
కాకయున్న నేకాకి యై । రాకయున్నె?. 1081

ఉ. చంద్రుఁడు కామి యై గురువు।జాయకుఁ బ్రాపకుఁ డై రమించె, ద
వేంద్రుఁ డహల్యఁ గూడె, భువి । నెల్లరఁ వేనుఁడు బాధపెట్టె, ని
స్తంద్రమదంబునన్ విబుధ।సంఘము నానహుషుండు నేఁచె, రా
జేంద్రులు పెక్కు రిట్లు నశి।యించిరి రాజ్యమదంబుచేఁ గదా?.

గీ. జగతి ఋణశేషశత్రుశే।షములుఁ దలఁప
నగ్నిశేషంబుభంగిఁ బ్రా।ణాంతకములు;

సర్వముఁ ద్యజించి కానలో । సంచరించు
ఘనుని, నినుఁ జూడవచ్చెనే । కైకకొడుకు. 1083

గీ. అనుచుఁ గందోయిఁ గెంజాయ । యతిశయింప
వీరరసభూరుహంబు పు।ష్పించినట్లు
పులకితాంగుఁడై యగ్రజ।న్మునకు మ్రొక్కి
తత్పదరజంబుఁ దనదునౌ।దల ధరించి. 1084

గీ. సహజబలసాహసంబుల । సంభ్రమించి
వెండియు వచించె నీరీతి । భీతిఁ దక్కి
ప్రల్లదంబుల వచియించు।వాఁడ ననుచు
మతిఁ దలంపక యిపుడు నా।హితము వినుఁడు. 1085

గీ. కైకపంపున సామ్రాజ్య।గర్వమునను
భరతుఁ డిదె వచ్చెఁ జతురంగ।బలముతోడ
మించి విషమించు మన మింక । మిన్నకున్న
అరిగివచ్చెద నీయాన । యానతిమ్ము. 1086

చం. కరమునఁ జాప ముండ, దిన।కాంతుకులంబునఁ బుట్టియుండఁ గిం
కరునివిధాన నీపదయు।గంబు సతంబు భజించుచుండ, సు
స్థిరమతి నీదునామమును । జిత్తమునందు స్మరించుచుండ, సం
గరమున నన్ జయింప శితి।కంఠునకైనఁ దరంబె రాఘవా!. 1087

చ. కరినికరంబుఁ జొచ్చుహరి।కైవడి హుమ్మని హుంకరించి, యి
బ్భరతునిసైన్యమున్ నిశిత।బాణపరంపరఁ గూల్చివత్తు నీ
చరణములాన వే సెలవొ।సంగుము, వీనికిఁ దోడుగా మహే
శ్వరుఁడుఁ ద్రినేత్రమున్ దెఱచి । వచ్చిన వచ్చునుగాక రాఘవా!.

గీ. అనుచు వచియించి యెంతయు । నాగ్రహించి
నడుము బిగియించి బాణాస।నము ధరించి

మస్తకము వంచి, భక్తి నమస్కరించి
పొంత నిలిచినసౌమిత్రిపొలుపుఁ గాంచి. 1089

గీ. మందహాసంబు వదనాబ్జమండలమున
నంకురింపంగ, లక్ష్మణా యాగ్రహంబు
బడయవల దని శాంతభావంబుతోడ
క్ష్మాసుతానాథుఁ డీరీతి మందలించె. 1090

కం. "ఉచితానుచితంబుల సం
కుచితంబగు నాత్మ నెఱుఁగఁ గోరవు, నీవీ
వచనంబులఁ బ్రాగల్భ్యముఁ
బ్రచురింపఁగ నౌన వేగిరం బగుబుద్ధిన్. 1091

ఉ. హాని పొసంగు నంచు, నహహా! మనకొంప మునింగె నంచు, న
జ్ఞానవిధంబునన్ బ్రమసి సాహసవృత్తికి నాగ్రహింపఁగా
నౌనె? వృథాప్రయాస మగు నంచుఁ దలంప వొకింత; తోఁదతే
కాని, యెఱుంగ వెన్నఁడును గార్యము ముందఱి మంచిచెడ్డలన్.

కం. వేగిరపడి కార్యమునకు
బాగోగుల నరయ వీవు, పశ్చాత్తాపం
బేగతి నోర్చెదొ? సమరో
ద్యోగంబున కుత్సహింప నొప్పునె మనకున్. 1093

గీ. నీవు వచియించినది రాజనీతి యయ్యుఁ
దవ్వి తలపోసికొని క్రొవ్వి తాఁకఁ దగునె?
భరతుఁ డేటికి వచ్చెనో యరయకుండ
సాహసింతువె సౌమిత్రి! సమరమునకు?. 1094

మ. ధరణీరాజ్యమదాంధులై కుమతులై ధర్మంబు వీక్షింప రె
న్నరు బాంధవ్యము క్షత్రియోత్తములకున్ నైసర్గికం బయ్యు, స

చ్చరితుం డుత్తముఁ డార్యసన్నుతయశ।స్సంపన్నుఁ డీసృష్టిలో
భరతుం బోలినవాఁ డొకండు గలఁడే । భావింపుమా లక్ష్మణా!.

గీ. స్వర్గరాజ్యంబునైన లో।ష్టముగ నెంచు
భరతునకు నేల సామ్రాజ్య।వైభవంబు,
హృదయమునను ద్రిమూర్తుల।పదవి నతఁడు
తృణసమానంబుగా నెంచి । ధిక్కరించు. 1096

చ. భరతునిభక్తి యిట్టి దని । పల్కఁగ శక్యమె? యాతఁడే భువిన్
బరమపవిత్రుఁడున్ సుగుణ।వంతుఁ డనంతుఁడ నైననీవు త
త్స్థిరతరభక్తి యిట్టి దని । పల్కఁగ నోపు దనేకజిహ్వలన్
పొరపడి యెగ్గులాడితివి । పుణ్యతమున్ భవదీయసోదరున్. 1097

గీ. రాజ్యమదమున మతి దప్పి । రణముకొఱకు
భరతుఁ డేతెంచె నంటి వా।పలుకు కల్ల
నీ వహంకారవశమునన్ । దెలివిమాలి
ఘోరకార్యంబునకుఁ బూనుకొంటి వకట!. 1098

గీ. భరతుఁ డైశ్వర్యమదమునఁ । బ్రీతిభఁ దక్కి
కలుషితస్వాంతుఁ డగునన్నఁ । గల్ల యగును,
క్షీరవారాశి యొకచల్ల।చినుకు పడిన
యంతమాత్రాన విచ్ఛిన్న । మగునె చెపుమ. 1099

సీ. గోష్పాదజలమునఁ । గ్రుంకి యగస్త్యుండు
గతియించె నన నసం।గతము గాదె
క్ష్మాదేవి నైసర్గి।కం బగుప్రశాంతి
వర్జించె నన నసం।భవము గాదె
మశకాళిఫూత్కార।వశమున మేరువు
కంపించె ననుమాట । కల్ల గాదె

బహుళాంధకారంబు । భాస్కరుఁ గబళించి
వ్యాపించె నన నసత్యంబు గాదె

గీ. తుచ్ఛసామ్రాజ్యలక్ష్మికి । స్వచ్ఛమైన
యశముఁ గోల్పడి రాజ్యలో । భాంధకుఁ డయి
క్రూరుఁడై ధీరుఁడై । యిట్టిఘోరమునకుఁ
బూనుకొనె నన్న విపరీత । బుద్ధి గాదె. 1100

చం. సగళమనస్కుఁ డార్యజన । సన్నుతవర్తనుఁ డాతతాయియే
భరతుఁడు భక్తితత్పరుఁడు । పావనుఁ డంతటివాని నాత్మసో
దరునిఁ దృణీకరించితివి । ధర్మ మెఱుంగవుగాక లక్ష్మణా!
అరసి వచింపు మెగ్గులకు । నాతఁ డొనర్చినదోస మున్నదే?. 1101

గీ. భాస్కరాన్వయ మనుసరో । వరమునందు
భరతుఁ డనురాజహంసంబు । పాపపంక
దోషసలిలంబుఁ బాసి ని । శ్శేషముగను
సద్గుణక్షీరములఁ గ్రోలి । సంచరించు." 1102

గీ. అనుచు రాముండు భరతుని । ఘనత నెంచి
పెక్కుభంగుల వినుతింప । విన్నఁబోయి
మౌనముం బూని సౌమిత్రి । మ్రానుపడియె;
నచట భరతుండు చిత్రకూ । టాద్రియందు. 1103

గీ. తాను శత్రుఘ్నుఁడున్ నదిన్ । స్నానమాడి
యొడ్డునం దెల్లరన్ వేచి । యుండఁ గోరి
తమ్మునిం గూడి శ్రీరామ । దర్శనార్థ
మరుగుచున్ లోన నీరీతి । నరయఁజొచ్చె. 1104

గీ. "కైకకొడు కని నామెడఁ । గపట మెంచి
జానకీరామలక్ష్మణుల్ । సంశయమున

నితరదిక్కున కేగెద । నేమొ ? లేక
యాదరింతురొ నన్ను స।మ్మోదమునను. 1105

కం. 'కరుణాభరణుఁ డనుచున్
శరణాగతవత్సలుండు । శాంతుం డనుచున్
జరణాబ్జములకు మ్రొక్కినఁ
బరమాత్ముఁడు రాఘవుండు । భక్తులఁ బ్రోచున్. 1106

గీ. సంశయాత్ముఁడ నై రామ।చంద్రునందు
దోస మెంచితి నతఁడు ని।ర్దుష్టచరితుఁ"
డనుచుఁ దలపోసి, యన్నార్తుఁ । డన్నముఁ గని
నట్లు వీక్షించె నపుడు రా।మాశ్రమంబు. 1107

సీ. చిత్రకూటంబు వి।చిత్రదుర్గము గాఁగ
శాంతియు సుమతియు । సతులు గాఁగ
యమనియమంబు లు।త్తమభటతతి గాఁగ
మహితవైరాగ్యంబు । మంత్రి గాఁగ
మునులకుటీరముల్ । పురవరంబులు గాఁగఁ
బక్షులు మృగములుఁ । బ్రజలు గాఁగ
శబరాలయంబులు । జనపదంబులు గాఁగఁ
సింహాదిసత్వముల్ । సేన గాఁగ

గీ. జానకిన్ రామచంద్రుని ల।క్ష్మణునిఁ గొల్చి
శత్రువర్గంబు గెల్చి, ని।ష్కంటకముగ
జ్ఞానరాజుచేఁ బాలితం । బైనరాజ్య
మనఁగ నొప్పారె నప్పు డా।యాశ్రమంబు. 1108

చం. పికశుకశారికావితతి । వృక్షములందు, జలాశయంబులన్
బకములుఁ జక్రవాకములు । బంభరముల్ ప్రకటించునట్టిగా

నకళలకున్ మయూరములు । నాట్యములాడ, సతంబు సౌఖ్యదా
యకముగ నుండురాఘవుని । యాశ్రమమున్ వినుతింప శక్యమే?.

గీ. మంగళానందదాయక । మహిమఁ గన్న
రామగిరిఁ గాంచి, భరతుండు, । రాజయోగి
వరుఁడు యోగఫలంబును । బడసినట్లు
ప్రముదితాత్ముఁడై శ్రీరాముఁ । బ్రస్తుతించె. 1110

మ. భరతుం డంతట సోదరుం డనుసరింపన్ బర్వతం బెక్కి, సుం
దరశాఖానికరంబుచే దిశల స్నిగ్ధచ్ఛాయ వ్యాపింపఁగన్
పరువంబుం గలరక్తపల్లవఫల । వ్రాతంబు దీపింపఁగన్
బరికించెన్ వటవృక్షమున్ ఖగక । దంబస్థానమున్ దవ్వులన్. 1111

చం. భరతుఁడు తత్సమీపమునఁ । బర్ణకుటీరముఁ గాంచి, సన్మునీ
శ్వరులును రామలక్ష్మణులుఁ । బండితగోష్ఠి సతం బొనర్పఁగన్
ధరణితనూజచే విరచితం బగు వేదికఁ జూచి, యాత్మలో
స్థిరమగుభక్తి నెక్కొనఁగఁ । జేతుల మోడ్చి నుతించె నెంతయున్.

చం. భరతుఁడు క్షీరవార్ధి యన । భాసిలె, రామనియోగ మెన్న మం
దరగిరి యయ్యె, సర్వవిబుధప్రకరం బమృతంబుఁ గోరుని
ర్జరు లయి రాసముద్రమున । సంభవ మై సుధఁ బోలినట్టి ప్రే
మరసముఁ దెచ్చి రాముఁడు ర । మాపతి పంచె జగద్ధితార్థి యై. 1113

గీ. జన్మపావన మనుచు నాశ్రమముఁ జేరి
అహహా ! తాపత్రయాగ్ని చల్లారె ననుచు
భరతుఁ డెంతయు సంతోషభరితుఁ డయ్యె
ముక్తిఁ బడసిన యోగీంద్రు । పోల్కి నపుడు. 1114

సీ. పరమపావన మైన । శిరమున వరజటా
జూటంబు మహిమంబుఁ । జాటుచుండఁ

బాపఘ్న మైనయజ్ఞోపవీతము గ్రాలఁ
గటితటంబునను వల్కలము దనరఁ
దనదుపశ్చాద్భాగమున శరధి రహింప
దండ నుద్దండకోదండ మొనరఁ
గరపద్మముల సీత చరణాబ్జముల నొత్తఁ
గరముల మోడ్చి లక్ష్మణుఁడు నిలువ

గీ. మౌనివేషంబుఁ దాల్చినమదను బోలి
సచ్చిదానందచిన్మూర్తి సరణిఁ గ్రాలి
వేదికను మౌనులం గూడి వెలయుచున్న
రామునిం జూచి భరతుండు ప్రస్తుతించె. 1115

గీ. పాహి మాం పాహి శ్రీరామభద్ర యనుచుఁ
ద్వరితగతి వచ్చి తనదుపాదములఁ బడిన
ఘనుని భరతుని రాముండు కౌఁగిలించి
చేష్టలం దక్కెఁ గన్నులు చెమ్మగిల్ల. 1116

ఉ. అంత గుహుండు వచ్చి చరణాబ్జములం బడి మ్రొక్కి, "దేవ ! నీ
పొంతకుఁ బౌరులున్ గురువు ముప్వురుతల్లులు రాఁ దలంచి, యీ
ప్రాంతమునందు నిల్చి ననుఁ బంపిరి నీకు నెఱుంగఁజేయ" న
న్నంతనె రాఘవుండు దరహాసము మోమునఁ దాండవింపఁగన్.

గీ. సద్గుణగరిష్ఠుఁ డగురామచంద్రుఁ డపుడు
చమకితుం డయి, శత్రుఘ్ను జనకపుత్రి
కంగరక్షకభటునిగా నచట నిలిపి
భరతుఁడున్ దాను వడి వడి బయలువెడలి. 1118

చం. గురువరుఁ జూచి పాదములకున్ బ్రణమిల్లినయంత నాతఁడున్
గర మనురక్తి రాఘవునిఁ గౌఁగిటఁ జేర్చి కృతార్థుఁ డయ్యె, నం

తురులును దల్లులుఁబ్రజలు । దుఃఖముఁ బాసిరి రాముఁ జూచి, భూ
సురవరు లెంతయుం బొగడఁ। జొచ్చిరి రాముని సద్గుణంబులన్.

గీ. మంచుఁ గప్పిన లతలను । మాడ్కి మిగులఁ
జిక్కి స్రుక్కిన తల్లుల । చెంత కేగి
తొలుత కైకేయి పాదాబ్జ । ములకు మ్రొక్కి
పిదప మిగిలిన సతులకు । వినతుఁ డగుచు. 1120

శా. "దైవాధీనము సర్వలోక మిది త । థ్యం బన్న తత్త్వంబు సం
భావింపంగలవాఁడె జ్ఞాని, పరులన్ । బాధించి దూషించి రో
షావేశంబున దోష మెంచఁ దగునే? । యజ్ఞాన మాఁ గాక, క
ర్మావాప్తోద్భవవల్లికాఫల మయో । గ్యం బయ్యె భోగ్యం బగున్.

గీ. మీర లెల్లరు నాదుకు । టీరమునకు
వచ్చి పావనంబును జేయ । వలయు" ననిన
మంచి దని వారు రామాశ్ర । మంబుఁ జేరి
సంతసించిరి తమ పథ । శ్రమ మణంగ. 1122

గీ. అంతట వసిష్ఠుఁ డెల్లరు । నాలకింప
జనులకున్ శరీరము లశా । శ్వతము లనుచుఁ
గడఁగి కొంత తత్త్వప్రసం । గంబు జరపి
రాజు మరణించె నని చెప్పె । రాఘవునకు. 1123

ఉ. అప్పుడ రాజు చచ్చినటు । లందఱుఁ గుందిన యంత రాముఁడున్
ముప్పుఘటిల్లినట్లు కడుఁ । బొక్కి వివేకముఁ దక్కి, వెండియున్
దప్పదు మృత్యు వెంతటికి । దస్థున కేనియు నంచుఁ గన్నులన్
గప్పిన బాష్పముల్ దుడిచి । క్రమ్మఱ ధైర్యముఁ బూనె నెమ్మదిన్.

ఉ. లోకములోన సత్యగుణ । లోలుఁ డనంగ యశంబుఁ గాంచి సు
శ్లోకుఁడు తండ్రి స్వర్గపురిఁ । జొచ్చెఁగదా యని యూఱడిల్లి యా

ప్రాకటతత్త్వవేత్త యగు। రాముఁడు లేచి వసిష్ఠుతోడ మం
దాకినిఁ బావనుం డయి య।థావిధి శ్రాద్ధముఁ బెట్టెఁ దండ్రికిన్.

చం. చిరతరపాపపంకము న।శింపఁగఁ జేయు నిమ్నం డెవండొ? భీ
కరబహుళాఘతూలములఁ। గాల్పఁగ నెవ్వని నామ మగ్ని యో
స్మరణముఁ జేయుమాత్రమున। మంగళ మిచ్చెడువేల్పెవండొ, యా
కరివరదుండు రాఘవుఁడు। గంగఁ బవిత్రతఁ గాంచె నెంతయున్.

గీ. శ్రాద్ధకర్మంబుఁ గావించి। సంతసించి
యన్నదిన్ స్నానముం జేసి। యనఘుఁ డైన
అవ్వసిష్ఠునితోఁ దన। యాశ్రమమున
కేగుదెంచె మహామహుం। డినకులుండు. 1127

గీ. అట్లు చనుదెంచి, తల్లులు। నాప్తజనులుఁ
బౌరులున్ మంత్రివర్యులు। బ్రాహ్మణులును
తనదుపలుకుల నాలింప। మునివరేణ్యు
నెలమి వీక్షించి శ్రీరాముఁ। డిట్టు లనియె. 1128

గీ. "కందమూలఫలంబులఁ। గడుపు నింపి
ఇచట మీరు గాసిలిన న।హింపఁ గలనె?
అకట! యుగములు గడచిన। యట్టు లయ్యె
నేఁటికిన్ మిమ్ము దర్శింప। నిర్మలాత్మ. 1129

గీ. మీర లెల్లరు నిచ్చోట। మెలఁగుచున్నఁ
బొలుపుఁ గాంచునె సాకేత। పురవరంబు?
పిన్నవాఁడ నే నేమని। విన్నవింతు?
నుచితమున్ మీర లూహింప। నొప్పుఁగాక." 1130

కం. నావుడు వసిష్ఠుఁ డిట్లను
"నీ వెఱుఁగనినీతి గలదె। నృపకులతిలకా!

భావింప ధర్మబద్ధుఁడ
వావంతయుఁ దప్పు వోదు । న్యాయ్యపథంబున్. 1131

కం. కరుణాసాంద్రుఁడ వాపయిఁ
బరమాత్ముఁడ విట్టు తెలమిఁ । బలుకుట యగుదే ?
పురిఁ బాసినవీరలు నీ
చరణాబ్జము లాశ్రయించి । సౌఖ్యముఁ గనరే ?" 1132

చం. వననిధిఁ గ్రుంకనున్న పడ। వన్ గలవా రనుకూలమారుతం
బున కెనలేనిధైర్యమును । బొందువిధంబునఁ బౌరు లెల్లరున్
ఇనకులవర్యువాక్యముల । కెంతయుఁ గుంది సముత్తరంబుగా
మునివరుఁ డాడుమాటలకు । మోదముఁ బొందిరి నెమ్మనంబులన్.

గీ. సీత నిర్మలచిత్తయై । చెంత కేగి
అత్త యని కైక నెంతయు । నాదరించె;
"ఎంతపని చేసితి" వటంచు । నేవగించి
భావగతదుఃఖమునఁ గైక । పరితపించె. 1134

సీ. "అపకీర్తి నీరీతి । నార్జించితిని గాక
మృత్యువైనను గొంత। మేలు గాదె
నరకంబునం దైన । నాకుఁ దా వున్నదే ?
రాముఁడు లేనిసా। మ్రాజ్య మేల
అన్నను బాసి, నిద్రాహారములు రోసి
భరతుండు శుష్కించె । వ్యాకులమున
ఆరఁ బండినవిండు। పైరు వ్యర్థముఁ జేసి
యీతిబాధల ఘటి। యించినట్లు

గీ. రామపట్టాభిషేకాంత। రాయమునను
దిద్దుకొనరానిదూషదఁ । దెచ్చికొంటి

నెంత బ్రతిమాలిన నొకించుకంతయైన
సమ్మతించునె శ్రీరామచంద్రుఁ డిపుడు. 1135

చం. గతజలసేతుబంధనము కైవడి నున్నది నావిచార మే
గతి బ్రతిమాలినన్ యశముఁ గానలపా లొనరించి, వెడియున్
క్షితిని బలిగ్రహింపఁ దమకించునె రాముఁడు ? నన్నుఁ బోలు దు
ర్మతులకు నెట్టివేళను బ్రమాదము గాక ప్రమోద ముండునే ?"

మ. అని చింతించుచు బ్రహ్మవ్రాఁత యనుచున్ హా మంథరా యెట్టు లీ
పనికిన్ నన్ బురికొల్పి భూపతికిఁ బ్రాణాపాయమున్ గూర్చినా
వనుచు న్నెత్తిని మొత్తుకొంచు సురమాయామాంద్యము న్బాసి వే
చని కౌసల్యకు మ్రొక్కెఁ గైక కడుఁ బశ్చాత్తాపసంతప్తయై.

కం. మరునాఁ డుదయంబున న
బ్భరతుండు వసిష్ఠమౌనివర్యుని ధరణీ
సురులున్ బౌరులు మంత్రులుఁ
బరివేష్టింపఁ బరికించి భాషించెఁ దగన్. 1138

గీ. ఇంతద వ్వేగుదెంచితి మెంతకొఱకొ
మఱచితో కాక, పౌరులు మంత్రివరులు,
భూమిసురవర్యులు వసిష్ఠమునివరుండు ;
సమయ మీరీతి వెచ్చింపఁ జనునె మనకు ?. 1139

గీ. అనవుడు వసిష్ఠుఁ డౌ నని యాలకించి
పౌరవర్యుల సచివుల బ్రాహ్మణులను
గాంచి భరతునిపలుకుల గౌరవించి
పలికె నీరీతి (శ్రీరామభద్రు) నెంచి. 1140

ఉ. సూరకులప్రదీపకుఁడు శూరవరేణ్యుఁడు, సత్యసంధుఁ డు
ద్ధారకుఁ డార్యలోకనుత ధర్మధురీణుఁడు, వేదమార్గ సం

చాపుఁడు, దుష్టశిక్షకుఁడు । సజ్జనరక్షకుఁ డెంచిచూడ సీ
తారమణుండు మానవుఁడె । దైవసముండు చరాచరాళికిన్. 1141

సీ. స్వార్థరహితుండు నీతిజ్ఞుఁ । డార్యహితుఁడు
ప్రేమకున్ స్థానభూతుండు । రామచంద్రుఁ
డతనిఁ గొనిపోవ వచ్చితి । మాయుపాయ
మరసి యెఱిఁగింపుఁ డెల్లరు । ననఘమతులు. 1142

కం. అన విని భరతుం డిట్లను
మునినాయక నీ కుపాయ।మును దెల్పఁగఁ జా
లినఘనుఁ డీసభఁ గలఁడే ?
ఇనవంశము నిన్నుఁబట్టి । యినను రహించెన్. 1143

ఉ. నావుడు మౌని లేచి చెలు।వన్వ ముఖంబునఁ దోఁప నిట్లనెన్
ఈవును నేను మంత్రిలు మ।హీసురవర్యులుఁ బౌరముఖ్యులున్
శ్రీవరుఁ డైనరాఘవుని। చెంతకు నేగుద మింక లెండు, మీ
భావములన్ గ్రహించి గుణ।భద్రుఁడు రాముఁడు సమ్మతింపఁడే?

గీ. అనిన నెల్లరు మునివర్యు । ననుగమించి,
ఇనకులాఢ్యునిసన్నిధి । కేగి రపుడు;
జానకీవిభుఁ డెల్లర । సత్కరించి
మౌనివరుసన్నిధిన్ సుఖా।సీనుఁ డయ్యె. 1145

గీ. అంతట వసిష్ఠుఁ డెల్లరు । నాలకింప
మెచ్చఁదగుధర్మముం గూర్చి । ముచ్చటించి,
జానకిన్ లక్ష్మణుం గాంచి । సన్నుతించి,
రామచంద్రుని నీరీతిఁ । బ్రస్తుతించె. 1146

శా. సర్వజ్ఞుండవు నీతిధర్మగుణవి।జ్ఞానంబులన్ గల్గియున్
గర్వం బించుకయున్ వహింపవు యశః।కాముండ వెల్లప్పుడున్

శర్వుండున్ నిను సన్నుతించు ననిసన్ । శంకింపఁ డేమూఢుఁడున్
ఉర్విన్ బ్రోవఁగఁ బుట్టినట్టిహరివో । యూహింపఁగా శక్యమే?.

ఉ. ఘనుఁడవటంచు నెంతయు ము।ఖస్తుతిగా వచియించువాఁడనే?
అనఘ! భవత్సహోదరులు । నాప్తులుఁ బౌరులు భూసురోత్తముల్
జనులు సంతసించుగతి । సంచరియించిన నాకుఁ జాలు; నీ
మనము గ్రహింపఁగాఁ దరమె । మానవదానవదేవతాళికిన్. 1148

చ. భరతుని బోలుసోదరుఁడు । భక్తవరుండు పవిత్రచిత్తుఁ డీ
ధరణిని లేఁడు లేఁడనుచుఁ । దథ్యముగన్ వచియింతు నన్న నా
సరసిజనేత్రుఁ డిట్లనియె, । సత్యము సత్యము మౌనినాథ మా
భరతుఁడు ప్రేమపాత్రుఁ డని । పల్కిన సద్దియు మున్నె యేరికిన్.

గీ. అంతట వసిష్ఠుఁ డెంతయు । సంతసించి
భరతునిన్ జూడ నాతండు । పలుకఁదగిన
తరుణ మిది యంచు భావించి । ధన్యుఁడ నని
పెద్దలకు మ్రొక్కి యీరీతి । విన్నవించె. 1150

చ. "గురువు వచించినట్టిపలు।కుల్ వినినాఁడవు రామచంద్ర! సు
స్థిరమతి నామనోగతముఁ । దెల్పఁగ మాటలు రావు, కన్నులన్
దొరలినబాష్పజాలము ని।నుం గననీయదు, పెక్కు లేల నా
చరిత మెఱుంగు దీ వెఱుఁగ।జాలని దెద్ది? మహాత్మ చెప్పుమా.

మ. అపరాధం బొనరించుశాత్రవుని సౌ।హార్దంబు దీపింప స
త్కృపతోఁ బ్రోచెద వీవు, సోదరుని న।ప్రేమించుటే యబ్రమా?
కపటంబున్ వహియించి దుష్టవరమున్ । గాంక్షించి నాతల్లి యీ
విపరీతార్తి ఘటించెనంచు మదిలో । వేమాఱు దుఃఖించెదన్. 1152

గీ. కైక కుటిలాత్మ యయ్యు నే । ఘనుఁడ ననుచుఁ
జెప్పుకొన నౌనె? యయ్యది । సిగ్గు గాదె?

నింబవృక్షంబునందు జ।నించుఫలము
ఆమ్రఫల మనవచ్చునే । యనఘ చెపుమ. 1153

గీ. కుమతి యగుఁగాక కైక నే । సుమతి ననిన
విశ్వసించునె లోకంబు । వీస మైన?
నత్తగుల్లలోఁ బుట్టినే । ముత్తియంబు?
కైక కేరీతిఁ బుట్టు లో । కైకఘనుఁడు?. 1154

గీ. ఇతరులం జూచి దూషింప । నేమిఫలము?
నాదురదృష్ట మింక వి । వాద మేల?
అన్నివిధముల భ్రష్టుండ । నైతి నేను,
ఓర్చెదం గాక; నీదయ । యున్నఁ జాలు. 1155

గీ. ఈసభామధ్యమునను ము।నీంద్రుమ్రోల
దైవసముఁడవు నీసన్ని।ధానమునను
బలికితిన్ నాదుహృద్గత।భావములను
ఇతరు లేమనుకొన్న నా । కేల చింత?. 1156

గీ. ఆటపాటలవేళ బా।ల్యముననైనఁ
గోపమును జూపియెఱుఁగవు । కోవిదుఁడవు
నాదు దోసంబు నీయది । గాదె యనఘ!
వచ్చినవిపత్తులం బాప । వలదె నీకు. 1157

చ. వసువులఁ బొందవచ్చు నని । వంచనఁ జేసిననామతల్లిచే
నసువులఁ బాసె వృద్ధనృపుఁ । డక్కట! యేమనవచ్చు దుర్విధిన్?
పస చెడి దుఃఖభారమునఁ । బౌరులుఁ దల్లులుఁ బొక్కి స్రుక్కి రే
నసురుసు రంచు నిన్ దలఁచి । యాపదలన్ సహియింప నోపితిన్.

గీ. ఎట్టియాపద నైన స।హింతుఁ గాని
జానకీదేవితోడ, ల।క్ష్మణునితోడఁ

పాదచారి వై రాముండు । వనమునందు
సంచరించుచు నున్న నే । నేఁడు గలనె ?. 1159

కం. నినుఁ గనుఁగొన వచ్చితి ని
వ్వనమునకుఁ రామచంద్ర! । భావింపుము, నన్
గనుమా, వినుమా, మనుమా
మనుమార్గముఁ బట్టి యేలు।మా మానవులన్". 1160

కం. అన విని యెల్లరు భరతుని
గని పొక్కిరి, మంచుఁ గనిన।కమలములగతిఁ;
ఇనకులకైరవచంద్రుం
డన నొప్పినరామచంద్రుఁ । డపు డిట్లనియెన్. 1161

గీ. వ్యర్థముగ నిట్లు చింతింప । నగునె భరత!
అఖిల మీశ్వరాధీన మం । చరయవలయు
నఖిలలోకంబులన్ గల । యనఘుమతులు
నీయధీనులు; నాయభి।ప్రాయ మిదియ. 1162

గీ. నీవు కుటిలుండ వని యెంచు।నీచుఁ డకట!
ఇహ పరంబులకున్ దూరుఁ । డింత యేల?
తగినపెద్దలశిక్షఁ బొం।దనిఖిలుండు
జననియనుకైక దూషింప । సాహసించు. 1163

ఉ. తమ్ముఁడ! నీదునామమును నె।దన్ స్మరియించినవాఁడు సర్వపా
పమ్ముల సంహరించు, నశు।భంబులఁ బొందక ఖ్యాతిఁ బొందు, లో
కమ్మున సర్వసౌఖ్యములఁ । గాంచు; మదీయమనోగతంబు స
త్యమ్ముగఁ జెప్పుచుంటిఁ బర।మాత్మునిసాక్షిగ విశ్వసింపుమా.

సీ. ధరణి క్షాత్రియ మైన।ధర్మంబు నీయందుఁ
గల దని నిక్కంబు।గా వచింతు

వ్యర్థంబుగా నిట్టు । లాత్మలోఁ దర్కించి
యనుయానముం బొంద । నగునె నీకు,
వైరంబుఁ జేరిమంబుఁ । గోరి దాఁపఁగ నౌనె ?
పక్షులు మృగములు । వనమునందు
మునులపొంత మెలంగు । పోలిక వ్యాధుని
పజ్జ మెలంగునే । భయముఁ దక్కి

గీ. హితము నహితముఁ బశుపక్షి । మృగము లెఱుఁగు
మానవుఁడు జ్ఞాని, యెఱుఁగక । మందుఁ డగునె ?
సత్యవాక్యంబుఁ బాలించె । జనవిభుండు
దోస మున్నదె నీయందు । వీస మైన. 1165

కం. పుత్త్రవ్యామోహంబున
గాత్రంబుఁ ద్యజించె భూమి । కాంతుఁడు, మన మీ
మాత్రమునకు గాసిలు టది
షాత్రంబే ? విడువఁ దగునె । సత్యవ్రతముఁ. 1166

గీ. సంశయముఁ బాసి, జనకునా । జ్ఞను దలంచి
చెప్పవలసినధర్మంబుఁ । జెప్పు మింక
సంచరింతు నీచిత్తాను । సారముగను;"
అనిన విని మేలు మే లని । రవనిసురులు. 1167

ఉ. రామునివాక్యముల్ విని సు । రల్ కడు భీతిలి సంశయించి సు
త్రామునిఁ జూచి యి ట్లనిరి, । "రాముఁడు వెండియు సమ్మతించునే
మో? మనకార్య మేమగునొ । యో సురనాయక! యో బృహస్పతీ!
మానసముల్ కలంగి యను । మానము బొందుచు నున్న వి త్తఱిన్.

చం. అన విని నిర్జరేంద్రుఁడు బృ । హస్పతిఁ గాంచినయంత నాతఁ డి
ట్లనియె, సురేంద్ర! రాముఁ డెవఁ । డంచుఁ దలంచితివో? పవిత్రచి

త్తుని రఘురామభక్తు భర। తుఁ స్మరియింపుము కార్యసిద్ధికిన్
మనమున సుంతయైన నను। మానముఁ బొందక విశ్వసింపుమా.

గీ. వెఱవఁ బని లేదు, రాముండు । మఱచు నొక్కొ ?
భరతుఁ డాతనిఛాయగా । నరయవలయు
ననిన విని పాకశాసను । డాత్మయందు
భరతునిన్ రామచంద్రునిఁ । బ్రస్తుతించె. 1170

సీ. భరతుఁ డంతట సర్వ। భారంబుఁ దనతలన్
బడక తప్పదటంచుఁ । గడుఁ దలంకి
పరిపరివిధములన్ । భావించి శంకించి
పూర్వోత్తరంబుల । బుద్ధిఁ దలఁచి
శ్రీరామచంద్రుని। చిత్తశుద్ధి గ్రహించి
యతనివాక్యంబుల । నర్థ మెంచి
అన్నయానతిఁ దాను । మన్నించు టెంతయున్
శ్రేయంబుగా మది । నిశ్చయించి

గీ. "తనకు నాయందు నున్నవా। త్సల్యమునను
తనప్రతిజ్ఞను విడనాడఁ । దలఁచెఁ గాదె"
అనుచు నూహించి యగ్రజు । నభినుతించి
చేతులన్ మోడ్చి భక్తి వ। చించె నిట్లు. 1171

కం. సర్వజ్ఞశేఖరుండవు
సర్వాంతర్యామి వీవ । సాధారణధీ
ధూర్వహుఁడవు నే నీయా
శీర్వాదముఁ గోరుపాద। సేవకుఁడఁ గదా. 1172

గీ. నీమహాహృదయంబు గ్రహియించు। నేర్పు లేక
బ్రమసి భీతిల్లితిని స్వల్ప। భావమునను

దిక్కుల నెఱుఁగఁజాలని । ధీవిహీనుఁ
డబ్జమిత్రుని దూషింప । న్యాయ మగునె ?. 1173

గీ. హృదయమాలిన్యము నశించె । సదయహృదయ
నీదు తత్త్వబోధామృతా।స్వాదనమున
పరిణతపాలక ! నిక్కంబు । వక్కణింతు
సత్య మన నీవ; లోక మ।సత్య మగును. 1174

గీ. ఛాయ కేతెంచినన్ సుప్ర।సన్న మగుచు
సకలదుఃఖంబుల నణఁచి । శాంతిఁ గూర్చి
ఎట్టివానికేన్ గోరిన । దిత్తు వీవు
వ్రేల్పుమ్రాఁకునకున్ నీకు । భేద మేమి ?. 1175

సీ. గురువులుఁ బ్రభువులుఁ । గరుణ నాయెడ స్నేహ
వాత్సల్యములఁ గల్గి । వఱలుకతన
మాలిన్యముం బాసె । మామకహృదయంబు,
ప్రభువులు మీరు సే।వకుఁడ నేను
ఓ కృపాసాగర । కాకుత్థ్సకులదీప
నన్నుఁ గటాక్షించి।నన్ రహింతు
నీసేవకుం డాత్మ।హితలాలసుం డయి
వర్తించు, వాఁడు దౌ।ర్భాగ్యుఁ డగును,

గీ. స్వామికార్యంబుపట్టున । స్వార్థ ముడిగి
సేవకుఁడు సంచరించుట । క్షేమ మగును,
ఈ వయోధ్యకు నేతెంతు। వేని ప్రజల
యభిమతంబు ఫలించు శ్రే।యము లభించు. 1175

గీ. స్వార్థపరమార్థములసార । మనుభవింప
సర్వసుకృతంబులఫలంబు । సంగ్రహింప

మోక్షకామినీశృంగార।ముఁ బఱికింప
వరద ! నీయాజ్ఞఁ బాలింప।వలయుఁ గాదె ?. 1176

ఉ. బన్నముఁ బాపి ప్రోవఁగ ను।పాయముఁ దెల్పఁగ మీకుఁ జెల్లు, నా
విన్నప మించుకంత విని । పిమ్మట నానతి యీయవచ్చు, సం
పన్నిధు లైనమీ కిపుడు । పట్టముఁ గట్ట మునీంద్రు నానతిన్
గ్రన్నన వస్తుసంచయముఁ । గైకొని వచ్చితిఁ బౌరకోటితోన్.

సీ. శత్రుఘ్నుఁడున్ నేను । సంచరింతుము వనం
బున, నయోధ్యకు మీరు । చనుట మేలు
లక్ష్మణశత్రుఘ్ను।ల నయోధ్యకుం బంపుఁ
డేను మీతో వత్తు । నానతిండు,
జానకితో మీరు । చనుఁడు పౌరులఁ గూడి
మేము మువ్వుర మిట । మెలఁగుచుందు
మవధరింపుఁడు దేవ! । యాత్మానుసారంబు
శ్రీవారి భజియించు । సేవకుఁడను

గీ. రాజనీతులఁ గాని శా।స్త్రములఁ గాని
ఏ నెఱుంగను ; దుఃఖించు।వాని కెట్టి
జ్ఞాన ముండును ? స్వామియా।జ్ఞఁ గొను బాని
సేఁదు మాటాడినన్ సిగ్గు । సిగ్గుపడును. 1178

కం. అవగుణములు నాలోఁ గల
వవధారు, మహానుభావ ! । యబ్ధిన్ నలుసుల్
వివరింపఁగ శక్యమె, సా
ధు వని మీ రంద్రు ప్రేమ।ధూర్వహు లగుటన్. 1179

శా. సందేహింపక, మీర లేకరణి నా।జ్ఞాపించినన్ బారు లా
నందింపం గల రానతిండు, భవదా।జ్ఞావర్తి నై యుందు, మీ

పొందుగ గోరితిఁగాక, విన్నపము నా। మోదించి పాలింతురో ?
ముం దేమార్గమునన్ మెలంగఁ దగునో । బోధింపుఁ డిచ్ఛాగతిన్.

చం. భరతుఁడు పల్కినట్టిమృదు। వాక్యములన్ విని సంతసించి రె
ల్లరు, నమృతాంధసుల్ సుమము। లన్ గురిపించిరి ధర్మనీతిత
త్పరుఁడయి సాధువాక్యములఁ । బల్కెఁ గదా యితఁ డంచు; జానకీ
వరుఁడపు డిట్టివాక్యములఁ । బల్కక మౌనముఁబూనె; నంతటన్.

ఆ.వె. జనకచక్రవర్తి । చరుఁ డంచుఁ బంపిన
దూత లేగుదెంచి । సీతఁ గాంచి
రామచంద్రుఁ జూచి । రంజిల్లియున్ గడు
వికలు లైరి మాని। వేషమునకు. 1182

చం. జనకునిదూత లందు ముని। చంద్రు వసిష్ఠునిఁ జూచి మ్రొక్కి, న
య్యనఘుఁడు సంతసించి జన। కావనినాథుని క్షేమమా
అనవుడు వారలున్ దశర। థావనినాథునితోడనే పురా
తనకుశలంబు బోయెను గ। దా యని యేడ్చి వచించి రీగతిన్.

గీ. "కీర్తి శేషింప దశరథ। క్షితివరుండు
అమరపురిఁ జేరె ననువార్త । నాలకించి
శోకసంతప్తదేహు లై । స్రుక్కి మావి
దేహు లకట! సార్థకనామ। దేహు లైరి. 1184

సీ. కైక పన్నినయట్టి। కపటంబు నాలించి
శ్రీరామచంద్రుని। శీల మెంచి
భరతుని ప్రవిమల। వైరాగ్యము గ్రహించి
యరసి రం డని మమ్ముఁ । బురికిఁ బంపి
ఎల్లరు నిచ్చోటి । కేతెంచి రని విని
పౌరులఁ గాపాడ । భటుల నిలిపి

చతురంగబలమును । సన్నద్ధముం జేసి
వనమున మిముఁ జూచ । బయలువెడలి

గీ. ఎచట నిలువక వడి వడి । నేఁగుదెంచి
ధన్యుఁడ నని ప్రయాగతీ । ర్థంబునందు
స్నానముం జేసి మాధవు । సన్నుతించి
వచ్చుచున్నాఁడు నేఁడు మా । ప్రభువరుండు. 1!85

గీ. అతఁడు యమునానదిఁ దాఁటె । నంత మమ్ము
నిచటికిం బంపెఁ దనరాక । నెఱుఁగఁజేయ ;"
అనిని విని మంచి దని ముని । యనునయించి
వేగముగ రాజదూతల । వీడుకొలిపె. 1186

చం. జనకమహర్షి వచ్చునని । జానకియున్ రఘురాముఁడున్ బురం
బున కిఁక రాకతప్ప దని । పొంగిరి పౌరులు ; రామచంద్రుఁడున్
మనమున మామరాక కను । మానముఁ బొందె నొకించుకంత; యిం
ద్రుని మన మెట్టులుండునో యె । ఱుంగఁగ శక్యమె బ్రహ్మకేనియున్.

ఉ. "ఆమనుజోత్తముండు జన । కావనినాథుఁడు వచ్చెనేని నే
నేమని చెప్పుదాన, ముఖ । మేగతి నెత్తి చరించుదాన, శ్రీ
రాముని నెట్టులైనను బు । రంబునకున్ గొనిపోవకుండినన్
క్షేమమె" యంచుఁ గైక కడు । సిగ్గిలి చింతిలుచుండె నత్తఱిన్.

ఆ.వె. "జనకచక్రవర్తి । చనుదెంచునందాక
రెండు మూఁడు దినము । లుండవచ్చు"
ననుచుఁ బౌరు లప్పు । డానందముం బొంది
యాదినంబుఁ గడపి । రాస దోఁప. 1189

గీ. వేకువను లేచి పౌరులు । విప్రవరులు
స్నానములఁ జేసి యుదయభా । స్కరునిఁ గొల్చి

పార్వతీ శివుల్ గణపతిన్ । బ్రస్తుతించి
ఇట్లు ప్రార్థించి రఘుకు ల। క్ష్మీశుఁ దలఁచి. 1190

సీ. ఓ రమారమణ ! మ । మ్ముద్ధరింపు మయోధ్య
యానందజలరాశి । యగునుగాక
భరతుండు యువరాజ। పదవిఁ గైకొనుఁగాక
రాముండు రాజయి । ప్రబలుఁగాక
సచివులు విప్రులు । సభ్యులుఁ గొలువ య
థాప్రకార మయోధ్య । తనరుఁగాక
ఈసుఖామృతమును । తృప్తిపీఱఁగఁ గ్రోలఁ
గోరితి మిద్ది చే। కూరుఁగాక

గీ. తల్లులున్ జుట్టములును సోదరులు గురువుఁ
దనకుఁ జేదోడుగా నయో। ధ్యాపురంబు
నేలమి జానకీనాయకుం । డేలుచుండ
మాకు మరణంబు చేకూరుఁ । గాక దేవ !. 1191

మ. అనురాగంబును రాజభక్తియును మో।హస్నేహభావంబులున్
దనరన్ బౌరులు విప్రు లివ్విధమునన్ । దైవంబుఁ బ్రార్థింపఁగా
విని విజ్ఞాతులు మౌను లిట్లనిరి, "సం।ప్రీతిన్ రఘూత్తంసు ని
ట్లనయంబు న్భజియించుమానవుల కే।లా యోగవైరాగ్యముల్?.

గీ. సుముఖుఁడు సులోచనుండును । సుప్రసన్న
చిత్తుఁడు నగురాముండు సు।శీలమునను
సంప్రదాయంబునన్ మహా।జలధి" యనుచుఁ
బొగడి శ్రీరామసేవయే । మోక్ష మనిరి. 1193

ఉ. పార్వతి! భూసురోత్తములుఁ । బౌరులుఁ గొల్చుచునుండఁగన్ విదే
హోర్వివిభుండు వచ్చె నని । యుష్ణకరాన్వయమౌళి, చిత్కళా

ఘూర్వహాఁ బాలకించి ముని।తోడను తమ్ములతోడఁ జిత్రకూ
టోర్విధరంబుపొంతకు మ।హాత్ముఁ డై చనె సత్వరంబుగన్.

గీ. సపరివారంబుగా రామ।చంద్రుఁ డటకు
వెడలినంతనె జనకక్ష్మా।ధీశ్వరుండు
స్యందనము డిగ్గి పరివార।మనుసరింప
నెలమి నెదురుగ నేతెంచి। పలుకరించె. 1195

గీ. జానకీప్రాణవిభుని ద।ర్శనమువలన
బడలికం బాసిరి విదేహ।పౌరవరులు;
జానకీనాథసంసక్త।మానసులకు
దేహసుఖదుఃఖములయందు। తెలివి యున్నె?. 1196

గీ. వార లప్పు డన్యోన్యస।త్కారములను
జేసికొని ప్రేమభరమున। వాసిఁ గనిరి;
జనకుఁడు మహర్షివరులకు। వినతుఁ డయ్యె
రామచంద్రుండు మామకుఁ। బ్రణతుఁ డయ్యె. 1197

మ. పరివారోపనదీప్రవాహాయుత మై। వైరాగ్యవిజ్ఞానసుం
దరతీరం బయి ఘోరదుఃఖపవనో।ద్యద్భంగగంభీర మై
పరమప్రేమరసస్రవంతి జనక।స్వాంతాద్రిసంభూత మై
సురభూమీసురలోకసన్నుతగతిన్। శోభిల్లెఁ గాత్యాయనీ!. 1198

గీ. దివ్య నావగా మునులు నా।వికులు గాఁగ
సకలపౌరులు వ్యాపారి।జనము గాఁగ
విభ్రమభయంబు లావర్త।వితతి గాఁగ
జాలువాఱెను ప్రేమర।సస్రవంతి. 1199

ఉ. పామరకోటి, లోకనుత।పావనతీర్థముగాఁ దలంప, ఘో
రామయదుఃఖతాపకలు।షాపహారం బని సర్వభూసుర

గ్రామణులున్ నుతింపఁ, గుధ।రంబును వీడ్కొని సంగమించె నా
ప్రేమరసస్రవంతి, రఘు।వీరునియాశ్రమశాంతవారిధిన్. 1200

కం. కరుణారససాగర మగు
సురుచిరరామాశ్రమంబుఁ । జొచ్చినపిదపన్
మరణించిననృపుఁ దలఁచుచు
నిరువాఁగులవారుఁ గుంది । రెంతయు వంతన్. 1201

కం. వ్యాకులమున స్త్రీపురుషులు
శోకం బనువార్ధి మునిఁగి । శోషిల్లి "కటా!
ఈకరణిఁ జేయ నెట్లు
ద్రేకించితి" వంచు బ్రహ్మఁ । దిట్టిరి కినుకన్. 1202

ఉ. దేవతలున్ మునీంద్రులు వి।దేహవిభుం గడు సన్నుతించి త
త్పావన మైనప్రేమనది । పారముఁ జూడఁగ నోడి రంత సం
భావనగా వసిష్ఠముని।వర్యుఁడు జానకితండ్రిఁ జూచి "రా
జా! వహియింపఁ గావలయు । స్థైర్యము ధైర్యము నిట్టివేళలన్.

గీ. భవమహాంధకారమునకు । భాస్కరుఁడవు
భవదమోఘవచఃకర।ప్రతతి నలరి
మునిజనాంభోజషండ ము।త్ఫుల్ల మయ్యె;
మోహ మనునది నీయెదం । బొదలఁ గలదె?. 1204

గీ. భువిని విషయపరు లన్, ము।ముక్షువు లని,
సిద్ధు లని మూఁడువిధములు । జీవు లనుచు
వేదములు చెప్పుచున్నవి । విబుధవర్య!
ఈ వెఱుంగనితత్త్వ మెం।దేని గలదె?. 1205

గీ. ఎవఁడు సతతంబు జానకీ।ధవునిఁ గొల్చి
భక్తిరసమునఁ దడిసిన।భావమునను

రాజిలునో వాఁడు సాధుసమాజమునను
వన్నెకెక్కును శ్రీరామభక్తిఁ దనరఁగ. 1206

గీ. నావికుఁడు లేని నావచందనమున, రామ
భక్తి లేని జ్ఞానము దుఃఖభాజనంబు;"
అనిన జనకాదులు వసిష్ఠుని నుతించి
తాలిమిం బూని చింతకుఁ దనివిఁ బొందె. 1207

గీ. స్త్రీలుఁ బురుషులు వికలితచిత్తములను
ఆశ్రిమోహాంతరామకీర్త్యంబువులను
స్నానములఁ జేసి నీరైన నానకుండఁ
బగలు గడపిరి కఠినోపవాసమునను. 1208

ఉ. పౌరులమాట కేమి, పశుపక్షిమృగాదులు జాలిఁ దూలి యా
హారము మాని నీరయిన నానక కానఁ జరించుచుండఁగా
శ్రీరఘురాము నామము స్మరించి భజించెడువారిఁ గూర్చి, దు
ర్వారవిచారతప్తపరివారముఁ గూర్చి వచింప నేటికిన్. 1209

క. కటకటపడుచిత్తములను
వటవృక్షము నాశ్రయించి పరివారం బు
త్కటనిశ్వాసానలమును,
అటవిన్ దహియింప నెంచినట్టుల విడిచెన్. 1210

ఉ. అందు వసిష్ఠమౌని, పరమార్థ మెఱింగినభూసురుల్ శతా
నందుఁడు, గాధినందనుఁడు, నవ్యపురాణకథాప్రసక్తిచే
సందఱిడెందముల్ కరఁగునట్లొనరించి యుపన్యసించి రా
నందము మేరమీఱుగతి జ్ఞానపథక్రమ మశ్రమంబుగన్. 1211

గీ. కొంద ఱించుక శాంతించి కుందు మాని
యూఱడిల్లుటఁ బలికించి యురుకృపాబ్ధి

దాశరథి లేచి గాధినందనునిఁ జూచి
ఇట్టు లనియెను తనపేర్మి ముట్టిపడఁగ. 1212

క. "కడచినది కాల మంతయుఁ
గుడువక సలిలంబు నైనఁ గ్రోలక పోరుల్
కడు డస్సి రింక నెటులేన్
గడుపుల నన్నంబు నింపఁగావలె ననఘా!. 1213

గీ. అనిన "నపరాహ్ణము గతించె నన్నముఁ గొన
నర్హమా" యన్న జనకుఁ డనర్హ మనియె
నౌ ననె వసిష్ఠుఁడున్ రాముఁ డాలకించి
యత్నములఁ జేసెఁ దగ ఫలాహారమునకు. 1214

ఉ. అల్లదె పద్మమిత్రుఁ డపరాంబుధిఁ గ్రుంకె, దినాంత మయ్యెనం
చెల్లరు లేచి స్నానముల కేగిరి; రామునియానతిన్ సమిత్
పల్లవకందమూలపరిపక్వఫలంబులఁ బుష్పరాశులన్
గొల్లలుగా గ్రహించి యటకున్ జనుదెంచిరి భిల్లనాయకుల్.

గీ. రామచంద్రునియనుకృపారసమువలనఁ
బర్వతవనప్రదేశముల్ ఫలవితాన
దాయకము లయ్యెఁ గనినమాత్రమున సకల
దుఃఖములు పటాపంచ లై తొలఁగుఁ గాదె?. 1216

చం. పరిసరకాననస్థగిరివర్గతటాకతరంగిణీసరో
వరములసొంపుఁ జెప్పు నొకవాక్యమునన్ వినుతింప నౌనె, సుం
దరతరుగుల్మకుంజసముదాయఫలప్రసవంబులన్ దదీ
యరసముఁ గ్రోలుతుమ్మెదలయందముఁ జూచిన దుఃఖముండునే?.

గీ. సతము ఫలపుష్పభారావనతము లైన
వృక్షములతోడ రాజిల్లె విపినసీమ

తథ్యముఁ దలంచిచూడ సీ।తాధవుండు
మాధవుం డన్న నింక సం।శయము గలదె?. 1218

గీ. రాఘవునిపాదధూళి క।రణ్య మెల్ల
పల్లవించి ఫలించు ట।బ్రంబె చెపుమ,
పతితపావన మైన యా।పాదధూళి,
శిలలకేన్ దోహదం బని। చెప్పఁ దగదె ?. 1219

ఆ. వె. జనకచక్రవర్తి। చనుదెంచె నని యెంచి
అతిథిపూజ సేయు। నవని దేవి
ఫలకుసుమవితాన।ములఁ బెట్టినవితానఁ
గానవయ్యె నపుడు। కాననంబు. 1220

ఉ. శాంతమనస్కులై నదిని। చల్లఁగ స్నానముఁ జేసి యావివ
స్వంతుఁడు గ్రుంకువేళఁ గని। వార్చి రమాధవుఁ గొల్చి, యాశ్రమో
పాంతకుజాళిఛాయలను। పౌరులు హాయిగ విశ్రమింపఁగా
నంతట మందగంధపవ।నాంకురముల్ ప్రసరించె నంతటన్. 1221

గీ. అనఘుఁడు వసిష్ఠుఁ డప్పు డ।త్యాదరమునఁ
జారవితతికిఁ బంపించె। ఫలచయంబు
దేవతలఁ గొల్చి వారలు। తృప్తిదీఱ
ఫలముల భుజించి హాయిగఁ। బండుకొనిరి. 1222

గీ. "పావనుం డైన జానకీ।భర్త లేని
కాపురంబున మన కేల। కాఁపురంబు ?"
అనుచుఁ బురుషులున్ స్త్రీలు రా।మాశ్రమమున
నాల్గుదినములఁ గడపి రా।నందమునను. 1223

ఉ. "ఈల్గినజేని కై వగవ। నేమిటికిన్? మన మిట్లు ముక్కుచుఁ
మూల్గిన లాభ మేమి? రఘు।పుంగవు లిద్దరు రాజ్య మేలఁగాఁ

గల్గినఁ జాల మే లగును । కామితముల్ ఫలియించు" నంచు నా
నాల్గుదినంబులున్ బుజ।నంబు మనంబున నెంచె నొక్కటన్.

కం. "సీతారాములు మనసా
కేతమునకు రాకయున్నఁ । గీడగు; లేదా
సీతారాములు గలవన
భూతలమే కోటిదేవ।పురముల కైనయ్యా. 1225

కం. ఏమనుజుఁడు పామరుఁడయి
రాముని నెడఁబాసి తనపు।రంబున కరుగం
గా మది నెంచునొ, నిర్జర
ధామంబున నైన వాఁడు । దౌర్భాగ్యుఁ డగున్. 1226

సీ. నిత్యంబు మందాకి।నీనదీస్నానంబు,
దశరథసుతపద్య దర్శనంబు,
జపతపోధ్యానంబు । సత్తీర్థపానంబు,
అమృతోపమానఫ।లాశనంబు,
రామగిర్యాశ్రమ।ప్రాంతసంచరణంబు
వివిధఋష్యాశ్రమ।విహరణంబు
ప్రకృతిలక్ష్మీరూప।వైభవాలోకంబు
ఖగమృగకృతరవా।కర్ణనంబు

గీ. ప్రాప్తమగుచుండఁ బదునాల్గు।వత్సరములఁ
గడపలే కేమి? యుగములఁ । గడపవచ్చు
నిట్టితఱిఁ బాసి పురమున । కెవ్వఁ డరుగు?
లేబరము గాదె రాముండు । లేనిపురము. 1227

కం. మన కేడ? నిట్టిభాగ్యం
బున్నది చేకూరు టేడ? । నాశాభంగం

బునఁ బొక్కుచు వెక్కుచు ని
వ్వనమున్ విడనాడ బ్రిహ్మ । వ్రాసెగ నుపటన్. 1228

కం. అని యిట్లు స్త్రీలుఁ బురుషు
లనురాగముకొద్ది మాట । లాడుచునుండన్
సునయన, సకియల్, రాముని
జనయిత్రులఁ జూడఁ బంచె । సమయముకొఱకై. 1229

చం. తనచెలికత్తె రాఘవుల । తల్లుల ముచ్చటఁ జూచి వచ్చి చె
ప్పినపలు కాలకించి తత్ । వేళ, మునీంద్రులు వేళఁ దెల్పఁగా
జనకుఁడు సమ్మతింపఁగ వె । సం జనినంతన రాణు లెంతయున్
సునయన నాదరించి కను । సొంపగు నాసన మిచ్చి రాదటన్. 1230

గీ. అమ్మహారాణు లెంతయు । నాదరించి
పలుకరింప నాసతిమేను । పులకరించె;
వారిస్నేహంబునకు బంధు । భావమునకుఁ
గఠినవజ్రంబుసైతముఁ । గరఁగుఁ గాదె. 1231

గీ. ప్రేమకరుణారసములు మూ । ర్తిభవించి
నట్లు లాసతీమణులు క । న్పట్టి రపుడు;
వినయము రహింప సునయన । సునయనముల
నెత్తి వారల వీక్షించి । యిట్టు లనియె. 1232

గీ. "సాధ్వు లగుమీరు దుఃఖించి । సగము గాఁగ
నిట్టియాపద పైఁ బడెఁ । దుట్టతుదకు;
పాలనురుగును భేదింప । వక్రిమతిని
వజ్రము బూనె నక్కటా । వనజభవుఁడు. 1233

సీ. అమృతంబు గలదంచు । నాలించుటే కాని
కంటిమే గరళంబుఁ । గాంచినట్లు

మానసరాజహం।సలు గోచరము గాని
బకకాకకులము క।న్పట్టినట్లు"
అనిన విని సుమిత్రి। యనె నిట్టు "లా నమ్మ
విపరీతముగ నుండు। విధికృతంబు
మంచికేని చెడ్డకేని। మనకర్మమే హేతు
వనుభవింపక తప్ప। దజునకైన

గీ. సృష్టివిలయాధికారి యై। సృష్టికర్త
కాలముంబట్టి కృతకర్మ।గతి నెఱింగి
మంచిచెడ్డల ఘటియించు। మానవులకు
ఎవనికేనియుఁ దప్పునే। యీశ్వరాజ్ఞ. 1234

గీ. అనినఁ గౌసల్య యిట్లనె। నజునిసృష్టి
ఇట్టులే యుండుఁ గాదన। నేరితరము?
మోహవశమున జీవులు। పొక్కుచుండు
రొరుల దూషింప నేల కా।నున్నపనికి?. 1235

గీ. సద్గుణంబుల భాతృవా।త్సల్యమునను
ధైర్యమున స్థైర్యమున మహో।దార్యమునను
భక్తియందును ధర్మాను।రక్తియందు
భరతు వినుతింపఁజాల దా।బ్రహ్మసతియు. 1236

చం. అలఘుని లక్ష్మణాగ్రజుని। నాతనిశీలము సన్నుతింప న
న్నలువపడంతి యేకవద।నంబునఁ బల్కిన, నత్తగుల్లతో
జలధి మథింపఁ బూన్కొనిన।చందమునన్ బరిహాసపాత్రి యౌఁ;
దెలిపెద నొక్కమాటఁ గుల।దీపకుఁ డాతఁడు పెక్కు లేటికిన్.

గీ. స్వర్గమున కేగినట్టి మా।పాత్రిణవిభుఁడు
అప్పుడప్పుడు భరతుని।యొప్పు లెంచి

అనుకొనఁగ వింటి నేఁడు క|న్నారఁ గంటి
సంశయము లేదు భరతుఁడు | సచ్చరితుఁడు. 1238

గీ. తగుఁ బరీక్షచే స్వర్ణర|త్నములమంచి
యెఱిఁగినవిధాన మనుజుని | నెఱుఁగవలయు
సమయముంబట్టి యిది శాస్త్ర|సమ్మతంబు;
భరతునిఁ బరీక్ష సేయఁగా | వశమె మనకు. 1239

గీ. తగని యావదర్థ పుత్త్ర వా|త్సల్యమునను
అక్కటా? బుద్ధితక్కువ | యయ్యె నాకు
భరతునిం గూర్చి సత్యంబుఁ | బలుకుచుంటి
రాముని వియోగము సహించి | బ్రదుక లేఁడు. 1240

గీ. పావనుండైన జనకుని|పత్ని వీవు
నీకు బోధింపఁ దగినంత| నేర్పు లేదు;
రాఘవునితోడ భరతుఁ డ|రణ్యమందు
నున్న, సౌమిత్రి పురమున | నున్న మేలు. 1241

చం. భరతునియందు దోసము ల|వంబయినన్ గనుపట్టదంచు సు
స్థిరమతివై వసన్నిధిని | చెప్పెదఁ జాలెద, రాజ్యలక్ష్మిచే
కులు ననునాస నాతఁడు వి|కుంఠపురంబుననైన రాముని
దొలఁగి వసింపనోపఁ డని | తోఁచు మనున్నది యెల్లభంగులన్.

గీ. అనుచుఁ గౌసల్య వచియించు|వినయవచన
ములకు సునయన యెంతయు | మోద మొంది
పలికె నీరీతి, దశరథు|పత్ని వందు
రాముఁ గన్నతల్లివి పతి|వ్రతవు దేవి!. 1243

గీ. చాలకాలంబు గడచె నా | స్థానమునకుఁ
శీఘ్రముగఁ బోయివచ్చెద | సెల వొసంగుఁ

డనుచు సునయన రాణుల। యనుమతిఁ గొని
వేగముగ భర్తసన్నిధి। కేగి నిల్చి. 1244

గీ. భరతునిం గూర్చి కౌసల్య। పలికినట్లు
భర్త కెఱిఁగించి, యినవంశ। పావనుండు
గంగకంటెఁ బవిత్రుండు। ఘనుఁడు, పూజ్యుఁ
డతని వినుతింపఁ దరము గా। దజున కైన. 1245

గీ. అనిన విని మేలు మే లని। యాత్మ నలరి
అమృతచందనగంధచం। ద్రాతపములఁ
బోలుభరతునివ్యవహార। మును నుతించి
జనకుఁడు నిమీలితాక్షుఁ డై। సంతసించి. 1246

గీ. పుణ్యతముఁ డని నెమ్మేను। పులకరింప
భరతుఁ గొనియాడి వెండియు। భార్యఁ జూచి
తరుణి! యాలింపుమా సావ। ధానముగను
భరతుఁడే చూవె నిక్కంపు। బ్రహ్మ మనఁగ. 1247

చ. అనఘుము కీర్తిపాత్రి మహా। హా! భవబంధలతాలవిత్రి మా
తనిసుచరిత్రి మిట్టి దని। ధాతయు శేషుఁడుఁ గార్తికేయుఁడున్
త్రినయనుఁడున్ వినాయకుఁడుఁ దెల్పఁ। గ నోపరు; ధర్మనీతివ
ర్తనముల కాతఁ డొజ్జ యని। ప్రస్తుతిఁ జేసెద నల్ల వేళలన్.

గీ. ధర్మముం గూర్చి నీతివ। ర్తనముఁ గూర్చి
శాస్త్రములఁ గూర్చి పరమార్థ। సరణిఁ గూర్చి
పలుకుచుం గాని భరతుని। భావశుద్ధి
ఇట్టి దని చెప్పఁ జాలఁ బూ। ర్ణేందువదన!. 1249

చం. భరతునిసచ్చరిత్రమును। పావనజీవనమున్ సుశీలమున్

కర మనురక్తిఁ దో వినిన । గాన మొనర్చిన బోధ సేసినన్
నరులకు స్వప్నమందయిన । నారక మన్నది లేదు మానినీ !. 1250

కం. అమృతంబుకంటె మధురము
అమలం బగుగంగకంటె । నతిపావన ము
త్తమ మీభరతునిచరితము
నమృతాంధసు లైన నెఱుఁగ । రతివా వినుమా !. 1251

గీ. నిరుపమానుండు మాన్యుండు । పురుషవరుఁడు
అతనిగుణముల లెక్కింప । నవధి లేదు
సకలవిద్వత్కవీంద్రులు । సంశయించు
స్వర్ణగిరికి స్వర్ణగిరియే । సాటి యనిరి. 1252

గీ. జలవిహీనస్థలంబున । సంచరింప
మీనముల కెంతకష్టంబొ । మేర లేని
యతనిసుగుణంబుల నుతింప । నంతకష్ట
మగును, పలుకులనెలఁదికి । నైనఁ జాన !. 1253

చం. భరతునిభావ మాతనిప్రభావ మపార మెఱుంగరాదు ని
ర్జరులకునైన, నొక్కరఘురాముఁ డెఱుంగును లక్ష్మణాగ్రజుం
డరయఁగ నెట్టిధీరుఁడొ; మహామహిమాఢ్యుని, మోక్షకామి, స్వా
ర్థరహితునిన్ నుతింపఁగఁ దరంబె జగంబున నెట్టివానికేన్.

చం. పురమున కిప్డు లక్ష్మణుఁడు । పోవుటయున్ రఘురామచంద్రునిన్
భరతుఁడు గొల్చియుంటయు శుభం బగు, నిక్కువము న్దలంప ఖే
చరులకు సర్వమర్త్యులకు । సమ్మత మెల్లరికోర్కి దీఱ నా
సరసిజసంభవుం డిటుల । సంఘటియించినఁ జాల మే లగున్.

గీ. భరతుఁ డెన్నండు రాముని । బాయలేఁడు
అతనిభక్తికి శ్రద్ధకు । నవధి లేదు

స్వార్థపరమార్గములయందు । నాస మాని
అతఁడు రామాజ్ఞ కనుకూల।గతి మెలంగు. 1256

గీ. భరతునిప్రీతి శ్రీరామ।భద్రుప్రీతి
శక్యమె వచింప, భక్తివా।త్సల్యములకు
వనఘుఁ డగులక్ష్మణాగ్రజుం । డునికిపట్టు
న్యాయ్యభావంబునకు రాముఁ । డాటపట్టు. 1257

గీ. జానకీరామచరణాంబు।జములయందు
భక్తి చేకూరు భోగవి।రక్తికలన
స్వప్నమునసైన శ్రీరామ।భద్రునాజ్ఞఁ
దప్పి చరియింపఁ డాతఁడు । ధన్యతముఁడు." 1258

గీ. అనిన విని మేలు మే లని । యలరి యామె
తనదు నెలవున నిద్రించెఁ । దనువు మఱచి,
అఖిలసద్గుణసంపన్నుఁ । డైనరాము
సంస్మరించుచు నుండె నా।చక్రవర్తి. 1159

ఉ. ఆమహనీయుచిత్తము ప్ర।యాగ మనం దగియుండె, గాఢ మౌ
ప్రేమము ద్రేళ్లు నాటి వట।వృక్షముఁ బోలి రహించె, రాఘవ
స్వామిపయిం గలట్టినిజ।భక్తి, తదీయదళాంతరంబునన్
గామితముల్ ఫలించుగతిఁ । గ్రాలెను బాలముకుందునాకృతిన్

చం. వరవటపత్త్రశాయి యగు । బాలముకుందుని నాశ్రయించి భీ
కరజలధిన్ దరించినమృ।కండుతనూజుని బోలి, దుఃఖసా
గరమున నున్న యద్ధరణి।కాంతునిజ్ఞానము, భక్తిచే సము
ద్ధరణముఁ బొంది యోగసుఖ।థంబును బట్టి రహించె సత్త్వజిన్.

గీ. రమ్యతరరామనానుమం।త్రము జపించి
యోగనిద్రలో నున్న య।య్యుర్వివిభుని

మానసముఁ బోలి తూర్పు నిర్మలిన మగుచుఁ
తెలివిఁ గనినంత బల్లునఁ దెల్లవాఱె. 1261

గీ. ప్రాతరారంభవేళను బ్రాహ్మణులును
పౌరులున్ మానులున్ రాచవారు లేచి
స్నానములఁ జేసి దైవంబు సంస్మరించి
అకసి రపుడు గాఁదగిన కార్యక్రియంబు. 1262

ఉ. స్నానముఁ జేసి వార్చి, దిననాథున కర్ఘ్య మొసంగి, భక్తిమై
మానసమందు శంకరు నుమాపతిఁ గొల్చి, గృహంబుఁ బాసి వి
జ్ఞాననిధిన్ వసిష్ఠమునిసత్తముఁ జేరి నమస్కరించి స
న్మానముఁ జేసి లోకనుతనాముఁడు శ్రీరఘురాముఁ డిట్లనున్.

చ. "అడవిని నానిమిత్తమున నందఱు సౌఖ్యములన్ ద్యజించి, యి
ట్లిడుములఁ జిక్కియుండుటకు నేను సహింతునె? రాచవారికిన్
గడచెఁ గదా దినంబు లతికష్టమునన్; భవదీయబుద్ధికిన్
బొడమె నుకీతి మాకు హితమున్ దెలుపం దగుఁ దాపసోత్తమా!

చ. భరతుఁడుఁ దల్లులు న్మఱియుఁ బౌరవరుల్ మిథిలాధినాథుఁడున్
గరము విచారభారమున గాసిలఁగన్ గనలేక కన్నులన్
గరములఁ బెట్టుకొంటిఁ గడగండ్ల సహించితి నింక నెల్లరున్
బురమున కేగునట్లు తలపోయు ముపాయము న్యాయ్యవైఖరిన్.

గీ. ఎల్లరిహితంబు బుద్ధి నూహింపఁ దగిన
ఒజ్జ మీ వెఱుంగనిమార్గ ముర్విఁ గలదె"
అనిన విని కన్నుఁగవ మోడ్చి మునివరుండు
ధ్యానముం జేసి యిట్లనె దాశరథికి. 1266

గీ. రామచంద్రుండు పౌరులప్రాణములకుఁ
బ్రాణ మగు జీవమునకు జీవంబ యగును;

అహహా! నినుఁ బాసి పురి కెవ్వఁ । డరుగఁగలఁడు?
అరిగినన్ బ్రహ్మ ప్రతికూలుఁ । డగునుగాక. 1267

గీ. రామపాదాంబుజములందుఁ । బ్రేమ లేని
వానిధర్మంబు కర్మంబు । వ్యర్థ మగును;
నీవియోగంబె దుఃఖంబు । నిర్వికార!
నీసుసంయోగమె సుఖంబు । నిరుపమాన!. 1268

ఉ. నే గమనింపఁజాలితిని; । నీయెడ రాగము లేనియోగికిన్
యోగము నిష్ఫలం బగుప । యోగము జ్ఞానము; వేల్పు లౌ ననన్
యాగముఁ జేసినన్ దనుపు । త్యాగముఁ జేసిన, మోక్షకామినీ
భోగము స్వప్నమం దయినఁ । బొందఁగఁ జాలఁడు భక్తవత్సలా!.

ఉ. నీవు కృపాపయోధి వవ । నిం గలజీవులచిత్తవృత్తులన్
భావములన్ గ్రహింపఁ గల । వాఁడవు విశ్వవిభుండ వంతటన్
నీవు రహింతు వాత్మ వయి । నిత్యుఁడ వాద్యుఁడ వీజగంబునన్
స్థావరజంగమాదులను । తావకతేజము గోచరం బగున్. 1270

గీ. అనఘ! నీయాజ్ఞ భక్తిమై । ననుసరింతు
నాశ్రమంబునకీ వింక । నరుగు" మన
వల్లె యని మ్రొక్కి రాముండు । బయలువెడలె;
జనకునిం జూడఁ జనియె న । మ్మునివరుండు. 1271

చం. మునివరుఁ డంత ధైర్యమును । బూని రఘూద్వహుసంస్మరించి, య
జ్జనకునిఁ జూచి యిట్లనియె । క్ష్మావర! ధర్మపథానుకూలవ
ర్తనుఁడవు పౌరకోటికి హి । తం బగువాక్యముఁ జెప్పి, యోగ్యమా
పని యిదియంచు సంశయముఁ । బాపుము బాపురె యంచు మెచ్చఁగన్.

చం. చతురుఁడ వుత్తముండవు, ప్రశస్తగుణంబుల కాకరుండ వు
న్నతహృదయుండ వార్యుఁడవు । జ్ఞానివి, భోగివి, రాజయోగి వె

వ్రతమున సమ్మతించెదఁ బ।విత్రచరిత్ర! జనానుకూలవ
ర్తన నిల నేలుభూపతివి । ధర్మపథంబున నిల్వు మెప్పుడున్.1273

గీ. న్యాయ్య మని యెంచి రాముండు । నగరమునకు
వెడలుటో జటాధారి యై । యడవులందు
నిల్చు నివసించుటయొ నిర్ణ।యింపవలయు
నీవు చెప్పింపఁ దగినన।దిద్ధ మిద్ది. 1274

చ. అన విని స్నేహమోహముల । కాస్పద మైన హృదంతరంబునన్
జనకమహర్షి యెంతయు వి।షాదముఁ బొంది తలంచె నిట్టు లి
వ్వనమున కేల వచ్చితి ధ్రు।వంబుగ మిక్కిలి తప్పుఁ జేసితిన్
ఇనకులవంశభూషణున । కే మని యుత్తరఁ బోధ సేయుదున్.1275

చం. జనకునియానతిన్ సకల।సంపదలన్ ద్యజియించి యోగి యై
వనమునఁ గాలమున్ గడప । వచ్చిన శ్రీరఘురాముఁ డెప్పుడేఁ
దనకుఁ బ్రతిజ్ఞఁ బాయునె? య।ధర్మము ధర్మము నిశ్చయించి, మే
లని వనవాసమే తగిన । దన్న ప్రజల్ విని సమ్మతింతురే?.1276

గీ. అనుచుఁ బరిపరివిధముల । నరయుచున్న
జనకునియవస్థ కెల్లరు । సంచలించి
రంతఁ దక్షిఁ జూచి మునులు త।న్ననుగమింప
భరతుఁ బలికింప జనకుండు । బయలువెడలె. 1277

చం. జనకుఁడు రాజయోగి, బహు।సంపదలం గలభోగి, త్యాగి, నన్
గనఁ జనుదెంచె నం చెమరు।గాఁ జని, రం డని యాదరించి, యా
సన మిడి మ్రొక్కినన్ భరతు।సాత్త్వికబుద్ధికి సంతసించి దీ
వనల నొసంగి నీ కిఁక శు।భం బగుఁ గా కని యాతఁ డిట్లనెన్.

చ. "ఎఱుఁగనివాఁడవే యినకు।లేంద్రుని మీరఘురామచంద్రునిన్
దఱుఁగనికూర్మిపేర్మిఁ గల।తమ్ముఁడ వాతని సోదరుండ వె

త్తెఱంగున నైన సంశయముఁ । దీఱిచి పౌరులకుంను మాన్పఁగాఁ
దఱి యిది యాలసింప నిఁకఁ । దాలిమి చాలదు బంధుసత్తమా !.

గీ. ధర్మనిరతుండు నిత్యసత్యవ్రతుండు
గాసిలె నతండు మనయందుఁ । గలిగియున్న
స్నేహవశమున; నీవు వచించునట్టు
లాతఁ డొనరించు నిఁక సంశయంబు వలదు." 1280

చ. అన విని లక్ష్మణాగ్రజుఁడు । ప్రాణసమానుని రామచంద్రుఁ జే
ర్మిని స్మరియించి మై పులకరింపఁగ, ధైర్యముఁ బాదుకొల్పి యి
ట్లనెఁ "బ్రభువర్యుఁడున్ప్రియుఁడు । నాప్తుఁడు దైవము నాకు రాముఁడే
యనుచుఁ దలంతు సంతతము । నయ్యది నేను వచింప నేటికిన్.

ఉ. బాలుఁడ నజ్ఞుఁడన్ మలినభావుఁడ, లోకవివేక మించుకేన్
జాలనివాఁడఁ దెల్పుటకుఁ । జాలుదునే? పితృతుల్యులైనమీ
రోలి వచించుపద్ధతుల । నూఁకొనెదన్, బహుభాష లేల? నే
జాలము సైఁపఁజాలఁ గొన । సాగుచుపాయముఁ దెల్పుఁ డిప్పుడేన్.

గీ. రాఘవుఁడు ధర్మపరుఁ డంచుఁ । బ్రభు వటంచు
నేఁ బరాధీనుఁడ నటంచు । నిశ్చయించి
తద్వ్రతము సర్వజనసమ్మతంబు మఱియుఁ
బ్రేమమయ మంచు నెఱిఁగి వర్తింపుఁ డింక. 1283

శా. సందేహంబున కాస్పదం బగుట నజ్ఞానంబు రేకెత్తుటన్
డెందం బాకులపాటుఁ జెందెఁ, గరుణన్ । మీ రేగతిన్ జూపినన్
నిందం బాసి చరింతు; ధర్మహితమున్ । నీతిన్ విచారింపఁగా
మందప్రజ్ఞుఁడ నాకు శక్య మగునే । క్ష్మామండలాఖండలా !."

గీ. అనిన విని మేలు మే లని । యభినుతించి
అహహా ! భరతునివాక్యంబు । లద్భుతంబు

లనుచు భరతుఁడో నెల్లరు నాకుఁ గాంచ
బయలు వెడలిరి శ్రీరామభద్రు కడకు. 1285

గీ. దర్పణంబునఁ బ్రతిబింబితంబు లైన
వస్తువులఁ జూడఁ దగుఁ గాక పడయ నగునె
అట్టులే యుండె భరతువాక్యములయర్థ
మనుచు మునివర్యు లాత్మల నరసి రపుడు. 1286

గీ. వారలం జూచి మీరలు వచ్చినట్టి
కార్యము గ్రహింపఁజాలితి ఘనులు మీర
లానతిచ్చినవడువున ననుసరింతు
ననుచు శ్రీరాముఁ డెల్లర నాదరించె. 1287

చం. భరతుఁడు రామచంద్రునికృపారసదృక్కులకున్ రహించి, త
త్తరుణమునన్ సరస్వతిని ధ్యానముఁ జేసి, విదేహభూతలే
శ్వరుని మునీంద్రుల న్మఱియు బ్రాహ్మణుల న్గని మ్రొక్కి యిట్లనెన్,
స్థిరమతి మీసముఖమునఁ జెప్పెద నాపలు కాదరింపరే?. 1288

ఉ. రాముఁడు నాదుతండ్రి, రఘురాముఁడు ప్రేముడిఁ గన్నతల్లి, శ్రీ
రాముఁడు నాప్రభుండు, జితరాముఁడు నాకు గురుండు, జానకీ
రాముఁడు నాసహోదరుఁడు, రాముఁడు నాకు సఖుండు, శ్రీరమా
రాముఁడు నాదుదైవతము; రామునిఁ దక్క నెఱుంగ నన్యమున్.

కం. సర్వాంతర్యామి వని సు
పర్వావనదక్షుఁడ వని భండనవిద్యా
పూర్వాహుఁడ వని నుతింతురు
సర్వజ్ఞా! రామచంద్ర! సద్గుణసాంద్రా!.

క. శరణాగతహితకారివి
కరుణాభరణుండ వఖిలకలుషంబుల వే

హరియించెదుజ్ఞానివి నా
తరమా వినుతింప సుగుణ।ధామా రామా !. 1292

గీ. తండ్రిమాటను జవదాఁటి । తల్లిఁ దిట్టి
అక్రమముగ నీయాజ్ఞ న।తిక్రమించి
మోహవశమునఁ బెద్దల।బుద్ధి వినక
పౌరులం గూడి యిచటికి । వచ్చినాఁడ. 1293

గీ. అమృతవిషముల, నుచ్చనీ।చముల మఱియు
మంచిచెడ్డల జగమునఁ । గాంచియుంటిఁ
గాని కలనైన నీయానఁ । గాకుసేయు
వాని వీక్షించి యుండ ని।వ్వసుధయందు. 1294

గీ. స్నేహముం గోరి వచ్చిన।సేవకునకు
నుచిత మిది యంచు నాతప్పు । నోర్చి తీవు
నాయవజ్ఞను సైరించి । ననుఁ బవిత్రుఁ
జేసితివి కృపాసాగర ! । చిన్మయాత్మ !. 1295

కం. నీపలుకులు ప్రాఁబలుకులు
పాపులఁ గాపాడుపతిత।పావన ! నాసం
తాపము హరియింపఁగ నీ
వోపుదు శాసింపు మింక । నొప్పో తప్పో. 1296

చ. భరతునిపల్కులన్ విని య।పారముదంబును బొంది రాముఁ డా
దరమునఁ జూచి యిట్లనియె । ధర్మముఁ దప్పనివాఁడనుండ వు
త్తరచరితుండ వార్యుఁడవు । తమ్ముఁడ! శంకఁ దొఱంగి యిప్పుడేన్
పురమున కేగి పౌరులు ప్ర।మోదముఁ బొందఁగ రాజ్య మేలుమా.

చ. భరతుయశస్సుధాకరుఁడు । భక్తుల నిర్మల మైనమానసాం
బరమునఁ గ్రాలుఁ, బండితులు । బాలచకోరము లై సుఖంతు రీ

స్వామునకు నైన మాభరతు। భావ మొకించుకయున్ గ్రహింపఁగాఁ
దరమె? మదీయసోదరుఁడు। ధర్మధురీణుఁడు నే నెఱుంగుదున్.

చ. జనకమహర్షి యుండఁగఁ బ్ర।శస్తతపస్వి వసిష్ఠుఁ డుండఁగా
మనుజులలోఁ బెఱిఁగినయ।మాత్యవరుల్ నినుఁ గొల్చుచుండఁగా
ననుజుఁడు వెంట నుండ నహ।హా పదునాలుగువత్సరంబులన్
జనుల భరించుచున్ గడపఁ। జాలవె సంకటము మేల తమ్ముఁడా!.

గీ. భరత! గృహభర్త వదనంబు। వంటివాఁడు
అతని కనుకూలముగ నుండు। ననుజవరుఁడు
హస్తమై పాదమై నేత్ర।మై రహించు
స్నేహ మెఱిఁగిన నీకు నేఁ। జెప్పవలెనె?. 1300

చ. అనవుడు లక్ష్మణాగ్రజుఁడు। ప్రాణసమానుని రామచంద్రునిన్
గని వచియించె నిట్లు; "వినుఁ। గా దనువాఁడనె నీదునానతిన్
జనియెదఁ బాదరక్షల నొ।సంగుము బ్రహ్మకృపాహి కేవల
మ్మని భవదీయపాదుకల। నొదలఁ దాల్చెద విశ్వవల్లభా!. 1301

చ. ప్రియమును ప్రేమమున్ సకల।వీరవరస్తుతకీర్తికిన్ మహా
దయ మగుధైర్యమున్ మఱియు। స్థైర్యముఁ గల్గిననీదుపాదుకా
ద్వయమునకు న్మనల్ వాగడఁ। బట్టముఁ గట్టి నిను న్స్మరించి, నీ
దయను దలంచి నేఁ గడపె।దన్ బదునాలుగువత్సరంబులన్.

గీ. కందమూలాదిఫలములఁ। గడుపు నింపి
వరజటాజినధారి నై। వ్రతముఁ బూని
దర్భశయ్యపైఁ బండి నిన్। దలఁచుకొనుచు
దినముఁ గడపెద నొకయుగ। మనుచు ననఘ!. 1303

గీ. వినుము పదునాలుగేఁడులు। వెడలినంత
భావలయు దేవ! నీ పటుల్। రాకయున్న

నీవియోగము సైచి నే । నిలువఁజాల
భస్మ మయ్యెదఁ బావక । జ్వాలలందు. 1304

గీ. దుష్టకపటాత్మకాసురీ । దష్ట యైన
రాజ్యలక్ష్మికి నీపాద । రక్ష గొప్ప
యౌషధం బని యెఱుఁగుదు । రఘువిరామ !
రామ ! సుగుణాభిరామ ! సం । గ్రామభీమ !. 1305

గీ. ప్రాణిసముదాయమును బ్రోచు । రక్షకు లని
ప్రేమరత్నంబుఁ గాపాడు । పేటిక లని
వంశమును గాచు రెండుక । వాటము లని
ప్రస్తుతించెద భవదీయ । పాదుకలను. 1306

గీ. కఠినపాషాణమును కాంత । గా నొనర్చి
ఖ్యాతిఁ గాంచినపదసరో । జాతధూళి
నిరతము భరించు భవదీయ । నిర్వికార
పాదుకల కే సమర్పింతు । వందనంబు. 1307

చం. అన విని రాఘవుండు దర । హాసము మోమున మొల్క లెత్తఁ బా
వనుఁడవు తమ్ముఁడా యనుచుఁ । బాదుక లిచ్చిన, ధర్మసేవకున్
గనుఁగవ యంచు లోకనుత । కర్మముఁ జేయుటకున్ గరద్వయం
బనుచు గ్రహించి యాభరతుఁ । డౌదలఁ దాల్చె భక్తిపెంపునన్.

గీ. జానకీరామచంద్రు లా । స్థానమునకు
వచ్చినట్టుల భరతాది । పౌరజనము
పాదుకలతోడఁ బురి కేగ । బయలువెడలె
రామునివియోగము సహింప । రాని దయ్యె. 5309

సీ. శ్రితమోక్షదాయక ! । జితపంచసాయక !
మనుధర్మనాయక ! । మంగళంబు

నిత్యసత్యవిచార! । నిగమాంతసంచార!
త్స్మాసుత్రాహ్యాదిచోర! । మంగళంబు
జ్ఞాననేత్రోన్నిద్ర! । సతతసన్నుతరుద్ర!
మహితగుణసముద్ర! । మంగళంబు
కరుణారసకలాప! । ఖండితశివచాప!
మార్తాండకులదీప! । మంగళంబు

గీ. సద్గుణారామ! శ్రీరామ! । సమరభీమ!
జలధరశ్యామ! యినకుల । సార్వభౌమ!
అఖిలభువనాభిరామ! యో । యఘువిరామ!
మంగళము నీకు సతతంబు । మంగళంబు. 1310

గీ. అనుచు భరతుండు పాదుక । లను ధరించి
మును వెడలుచుండ జనకుండు । వెంత నడువ
బ్రాహ్మణులు మానివర్యులు । స్వస్తిఁ బలుక
ననుగమించిరి పౌరు । లయ్యవసరమున. 1311

గీ. భక్తి విజ్ఞాన వైరాగ్య । వైభవంబు
మూఁడు మూర్తులఁ దాల్చిన । పోల్కిఁ దోఁప
జానకీరామలక్ష్మణుల్ । శాలనుండి
యుత్సహించి వీక్షించి ర । య్యుత్సవంబు. 1312

మ. అసిధారావ్రతధుర్యుఁ డైనభరతుం । డత్యుత్తముం డక్కటా!
కసి దీఱన్ జనుదెంచె నంచు దరహం । కారంబు పేరేపఁగా
నసహిష్ణుండను దుష్టవాక్యములఁ బా । పాత్ముండ నై పల్కితిన్
రసనన్ దుంచిన దోస మేమని సుమి । త్రానందనుం డేడిచెన్.

చ. జనకునితోడ విప్రముని । సంతతితోడ నమాత్యశేఖరుల్
జనన్ములు వెంట రా వెడలి । జానపదుల్ వినుతింపఁ గొండలన్

జనపదసీమలన్ నముల । సర్వపథంబు నతిక్రమించి, చ
య్యన భరతుండయోధ్యఁగని । హాయనికన్నుల మోడ్చి నేడ్చుచున్.

ఉ. జనులు మహోపవాసముల । సంతతమున్ నియమవ్రతంబులన్
దనువుల స్రుక్కఁ జేసి వద । నంబుల దైన్యము దోఁప రాముద
ర్శన మెపు డబ్బునో యని ని । శాంతములన్ దఱి వేచియుండఁగాఁ
గని భరతుండు బాష్పములఁ । గన్నుల జార్చి విషాద వేదనన్.

ఉ. ఏడ్చిన లాభ మేమి యని । యుంమక యోర్పు వహించి, చేతులన్
మోడ్చి, రఘూద్వహున్ దలఁచి । మున్న సభాస్థలిసింహపీఠికన్
దుడ్చి, పవిత్రపాదుకల । దోసిటఁ బట్టి, ప్రసూనరాశిలోఁ
బూడ్చి, యమాత్యశేఖరులు । భూసురులున్మనులున్న తింపఁగన్.

గీ. శుభముహూర్తంబునన్ మన । శ్శుద్ధితోడ
నఖిలజనకోటి చూడ, సిం । హాసనమునఁ
బెట్టి భక్తితోఁ బట్టంబుఁ । గట్టి యప్పు
డున్న రని యొక్కపెద్దని । ట్టూర్పు విడిచె. 1317

గీ. పిదప కౌసల్యకున్ గురు । పదసరోజ
ములకు వినతుఁడై, వృద్ధమం । త్రులను బిల్చి
మొక్కి, రాజకీయంబుల । ముచ్చటించి
పానుకలఁ జూచి సెల వని । బయలువెడలి. 1318

శా. నందిగ్రామముఁ జేరి, పర్ణగృహమున్ । గట్టించి, దీక్షన్ జటా
సందోహంబు ధరించి, వల్కలమునున్ । సంప్రీతిమైఁ దాల్చి, యా
నందబ్రహ్మము రామమూర్తి యనుచు । న్సత్పాదుకాయుగ్మమున్
సందర్శింపఁగ వచ్చు నిత్యముఁ బ్రతి । జ్ఞాపాలనాదక్షుఁడై. 1319

గీ. భోజనమునందు, వల్కల । ముల ధరించు
విధమునన్ వ్రతపాలనా । విధులయందు

అతులనిష్ఠాగరిష్ఠుల । ననుకరించి
మెలఁగు నాతఁడు సతతంబు । బిలమునందు. 1320

చ. త్రికరణశుద్ధిగా నతఁడు । ప్రేమమయుం డగుమానసంబునన్
సకలము రామచంద్రుఁ డని । సంకటలంపు విరక్తిఁ గల్గి కో
రికలను జంపి సౌఖ్యము వరింపక, శ్రీరఘురామచంద్రుపా
దుకలకు సర్వముం దెలిపి । తోడనె యేఁగును పర్ణశాలకున్.

ఉ. ఆపురభాగ్యభోగముల । నయ్యమరేంద్రుఁడు మెచ్చి యచ్చటన్
గాఁపుర ముండఁ గోరు నల । కాపురనాథు నటుండనిమ్ము; సం
తాపము లేక భోజ్యములు । త్యాజ్యము లంచు విరక్తి నాతఁ డా
హా! పదునాల్గువత్సరము । లట్టిపురంబున నట్టు లుండునే?. 13?2

గీ. పార్వతీ! రాఘవుఁడు పర । బ్రహ్మమూర్తి
అతని సేవించువానికి । నఖిలభాగ్య
భోగములు తృణప్రాయముల్; । మూఢుఁ డీర
హస్యము గ్రహింపఁజాలక । యడలుచుండు. 1323

క. మోహము నశియింపఁగ, సం
దేహము మది నంతరింప, । దృఢదీక్షాప్రో
త్సాహముకలనన్ భరతుని
దేహము శుష్కించె దివ్య । తేజము హెచ్చెన్. 1324

సీ. ఆస్యంబునన్ దేజ । మావిర్భవింపఁగ
నతులమనోబలం । బంకురించె
ఆత్మధర్మాసక్తి । యంతకంతకు హెచ్చెఁ
బ్రతిదినంబును భక్తి । ప్రబలుచుండె
ధీశక్తి వర్ధిల్లె । దివ్యదృష్టి రహించె
నూతనోత్సాహ ము । ద్భూత మయ్యె

శమదమధారణా । సంయమాదులఁ గల్గెఁ
జిత్తశుద్ధిని యోగ।సిద్ధిఁ బడసె

గీ. విమలహృదయంబు శరదంబ।రమును బోలె
గుణము లన్నియుఁ దారకా।గణము లయ్యెఁ
బ్రేమ మక్షయశీతాంశు।బింబ మయ్యెఁ
బలుక శక్యంబె భరతుని।వ్రతనిరూఢి. 1325

గీ. అడవిఁ బదునాలుగేఁడులుఁ । గడచినంత
ననఘుఁ డగురాముఁ డేతెంచు । ననెడునాశ
అతనిమానసశరదంబ।రాగ్రవీధి
డంబు మీఱెను ధ్రువమండ।లంబుభాతి. 1326

క. అనుదినమును శ్రీరాముని
ననురాగమతిఁ స్మరించి । యతినిష్ఠను, రా
మునిప్రతినిధు లని పాదుక
లను గొల్చుచుఁ గార్యవేళ।లను సేవకుఁడై. 1327

గీ. ఆనతిం గాని రాజకీ।యంబు లెల్లఁ
దెలియఁ జేయుచు దేహంబు । పులకరింప
ధ్యానముం జేసి రాముని।యాజ్ఞ యనుచు
రాజ్యరథమును నడపె నా।రాజసుతుఁడు. 1328

గీ. జనులు భరతునివ్రతచర్య । శ్లాఘనీయ
మనుచుఁ బొగడిరి, జనకుఁ డా।తనివిధాన
మంతయుం జూచి యెంతయు । సంతసించె
సిగ్గుపడి మాను లగ్గించి । రగ్గలముగ. 1329

చం. పరమపవిత్ర ముత్తమము । భవ్యతపోమహిమోజ్జ్వలంబు, సుం
దర మతినిర్మలంబు పర।తత్త్వయుతంబు శుభప్రదంబు, మ

స్తరభవమోహలోభతమ। సంబు నణంచెడు భానుబింబ మ
బ్భరతుచరిత్రమున్ బాగడ। బ్రహ్మకు నైనఁ దరంబె పార్వతీ!.

గీ. పాపపుదగజసింహంబు। తాపహరము
సకలసద్భక్తజనమోక్ష। సాధనంబు
భవభయవినాశనకరంబు। భరతుచరిత
మిట్టి దని చెప్ప శక్యమే। యెరి కైన. 1331

సీ. శ్రీరామచంద్రుని। ప్రేమామృతంబును
పరిపూర్ణముగ భక్త। వరుల కొసఁగ
భరతుఁడు జన్మించి। పరతత్త్వ మెఱిఁగిన
మునివర్యుల కగమ్య। ములుగ నుండు
యమనియమాదుల। శమదమాదులఁ జూపి
యాదర్శపురుషుఁ డై। యతిశయించె;
అతఁడు భూస్థలి। నవతరింపకయున్న
దుఃఖదారిద్ర్యాది। దోషములను

గీ. బాపి సన్మార్గముం జూపు। వాఁ డెవండు?
అతఁడు జన్మింపకున్న మ। హాత్తరంబు
రామచరితంబు నెఱుఁగఁ ద। రంబె మనకు?
భరతుచరితంబు త్రిభువన। పావనంబు. 1332

చం. భరతునిసచ్చరిత్ర మతి। పావన మంచుఁ దలంచి, నిత్యమున్
గరము విరాగి యై సకల। కామములన్ నిరసించి, జానకీ
వరునికథాసుధారసము। భక్తిమెయిన్ దని వోవఁ గ్రోలెనేన్
ధరణిఁ బవిత్రుఁ డై నరుఁడు। ధన్యతముం డగు సర్వమంగళా!.

చ. రవికులపావనుం డయిన। రాముని కీర్తి నుతించుచుఁ గవి
ప్రవరులజీవనం బనుచు,। వాణి పవిత్రముగా రచించితిన్

కవివరులార! రాఘవుజగన్నుతదివ్యచరిత్రివార్ధి నే
కవియుఁ దరింపఁ జాలునె? నగంబును పంగువు దాఁటనోపునే?.
శా. ధాత్రిన్ బేర్మిమయంబు కామదము శ్రీరామాయణం బంచుఁ బ్ర
ఖ్యాతిం గాంచిననీదుకావ్యము జగద్వ్యాప్తిన్ బ్రకాశింప, మ
చ్చేతఃప్రీతిగఁ బల్కుచుంటిని నినున్ సేవింపఁ, జేకొ మ్మికన్
శీతాంశోరమృతార్పణం బనుక్రియన్ సీతామనోనాయకా!.
ఉ. చందనచర్చితాంగ! శ్రితసంచయచందన! సర్వకామని
ష్యందన! వార్ధిబంధన! జితాసురనాయకరక్తతృప్తసం
క్రందన! సద్యశస్సుమవికాసితనందన! వాయునందన
స్యందన! సాధుభక్తసుజనార్పితవందన! నందనందనా!. 1336
క. సరసిజవిశాలనేత్రా!
సురనాయకవైరిజైత్ర! సుందరగాత్రా!
నరహరినుతసుచరిత్రా!
పరిపాలితవాయుపుత్త్ర! పరమపవిత్రా!. 1337
భుజంగప్రయాతము.

నరాకారగాత్రా! జనస్తోత్రపాత్రా!
నిరాకార! ధీరా! యనీకప్రచారా!
సురేశారినాశా! యశోధినివేశా!
పరేశా! నరేశా! భవానీశకోశా!. 1338

గద్య. ఇది శ్రీ భాగవతుల నారసింహశర్మ విరచిత
శ్రీతులసీరామాయణమునందలి
యయోధ్యాకాండము
సంపూర్ణము.
శ్రీరామార్పణమస్తు



# THIS CANCELS ALL PREVIOUS RULES.

***Estd. in 1911.***

**Registered.**

భాగవతుల నరసింహశర్మ,
ప్రొప్రైటర్,
వేగుంజుక్క గ్రంథమాల,
పూడిపెద్దివారివీధి,
బరంపురం (గంజాం)
**1928.**

NOTE THIS




TRADEMARK

సంపాదకులు:—బ్ర॥ శ్రీ॥ ఆదిభట్ల తరిణయ్యాసిద్ధాంతిగారు.

## నిబంధనలు.

1. నిరూపకనవలలు, సాంఘికనవలలు, పుణ్యచరిత్రములు, మృదుమధుర ప్రబంధములు, మనోహర నాటకములు, మనోల్లాసకరములగు నితిహాసములు, చక్కని కాగితముతో, రమ్యమగు అచ్చుతో, రెండుమాసముల కొక్కటిగా వెలువడును.

2. గ్రంథము వెలువడినవెంటనే చందాదారులకు ఒక్కొక్క గ్రంథము ఒక్కొక్కరూపాయికి వి. పి. చేయఁబడును. మనియార్డరు కమీషను ప్రత్యేకము. ఇతరులకు ప్రతిగ్రంథము రూ 1—8—0 (ఖర్చులతోసహా)

3. ఆరుగ్రంథములు (పోస్టేజీలుగాక) సంవత్సరమునకు ఆరు రూపాయలుమాత్రమే. ఈయారురూపాయలు ముందు (అడ్వాన్సుగా) బంపు చందాదార్లకు ఎట్టిఖర్చు లుండవు.

క్రొత్తగా చందాదారులగువారు మొదటి పార్సెలు పోస్టేజి మొదలగు ఖర్చులు భరింపకొనవలెను. ప్రతిగ్రంథముఁ దప్పక పుచ్చుకొను చందాదారులకు మాత్రమే పోస్టేజి భరింతుము.

4. చందాదారులగువారు వెనుకటి గ్రంథములలో నేయొకగ్రంథమునైనఁ గోరిరేని ప్రవేశరుసుము 0-4-0 మాత్రమే. అట్లుకాక, తాము ప్రవేశించినప్పటి నుండి గ్రంథములఁ బంపఁగోరిరేని ప్రవేశరుసుము 0-8-0 మాత్రమే.

5. చందాదారులగువారు వెనుకటి గ్రంథములు పుచ్చుకొనవలెనను నిబంధన యెంతమాత్రమును లేదు. వారు కోరిరేని (కోరినగ్రంథములబట్టి) చౌకగా ఇచ్చెదము.

6. అప్పుడప్పుడు వెలువడు అనుబంధగ్రంథములు చందాదార్లకుమాత్రమే యుచితము.

# గ్రంథరచనానియమములు.

1. Characterisation 2. Development of character 3. New Ideas 4. Historical Beauties 5. Description of nature and other varieties.

గమనింపుఁడు:— చందాదారులు ప్రతిగ్రంథముఁ బుచ్చుకొనుట తమకు విధియై యున్నది. తిరుగ పంపించినప్పటికి గ్రంథము నెంతమాత్రము త్రిప్పివేయరాదు ప్రతి గ్రంథమునకు ముందు ఇంటిమేషను పంపుదుము. ఇష్టములేనివారు వెంటనే మాకు తెలియఁజేయవలెను. త్రిప్పివేయక ప్రతిగ్రంథము పుచ్చుకొను చందాదారులకు మాత్రమే అనుబంధ మచితముగా పంపుదుము. అడ్వాన్సుపంపిన చందాదారులకు మేము కృతజ్ఞులమై యుందుము.

## నూతనప్రచురములు. (New Publications)

# శ్రీతులసీరామాయణము.

నిర్వచనము—చిత్రపటశోభితము.

వాల్మీకిరామాయణమువలెనే హిందూదేశమునం దంతటఁ బ్రఖ్యాతిఁ గాంచిన రామాయణ మిది. మనభాష కిదియొక నూతనాలంకారము. ఇది హిందీభాషయందు శ్రీతులసీదాసమహాకవిచే వ్రాయఁబడినది. బ్ర॥ శ్రీ॥ భాగవతుల నృసింహశర్మగారిచే నాంధ్రీకరింపబడుచున్నది. జగద్గురువగు శ్రీగాంధిమహాత్మునిచే నిత్యముఁ బారాయణము జేయబడు నీరామాయణప్రాశస్త్యముఁ జదివినవా రనేకవిధముల గొనియాడకపోరు వివిధరసములకు, నుపాఖ్యానములకు, మనోహరగాథలకు నిది జన్మసీమ ఒక్కొక్క కాండము చొప్పున వెలువడును ఆంధ్రీకృత శ్రీతులసీరామాయణముఁ బొగడుచు మహనీయులు వ్రాసిన యుత్తరములు మునుముందు ప్రచురింపఁబడును. బాలకాండము వెలువడినది కొలఁది ప్రతులుమాత్రము కలవు. అయోధ్యాకాండము రెండు భాగములు. ప్రతిసంపుటము చందాదారులకు రూ 1-0-0 ఇతరులకు రూ 1-8- పోస్టేజి ప్రత్యేకము.

# ఉగ్రభైరవము.

చందాదార్లకు రు 1—0—0 పోస్టేజి వేరే ఇతరులకు రు 1—8—0 పోస్టేజి వేరే

గ్రంథకర్త:— పోడూరి రామచంద్రరావుగారు, బి. ఏ, బి. యల్.

ఇదియొక భయంకరమైన డిటెక్టివ్ నవల. ఆంగ్లమునగల "The Hound of the Baskerviles" అను నవల ననుసరించి మృదుమధురశైలిని వ్రాయఁబడినది. చిత్రపటశోభితము. హంతకుఁడొక కాగిలముద్వారా చేయించిన యత్యద్భుత భయంకర ప్రక్రియ ఇందు నిరూపింపబడినది. తుదివరకుఁ జదువనిదే విడిచిపెట్టరు. గుండెలవియఁజేయు ప్లాటు. వలయువారు వెంటనే వ్రాయవలెను. కొలఁదిప్రతులుమాత్రమే కలవు.

# సర్వమంగళ.

చందాదార్లకు రు 1-0-0] [ఇతరులకు రు 1-8-0 ఎల్లరకు పోస్టేజి ప్రత్యేకము.

గ్రంథకర్త:— వారణాసి నరసింహారావు గారు.

ఇది యొక సరసమైన సాంఘికనవల. అరుంధతీ దమయంతుల పరోపకార పారీణత, సుశీలా సర్వమంగళల ధర్మసంకష్టములు. కామినీ భీమరావుల ప్రతిహింస, డాక్టర్ భువనసుందరుని దుర్దాంతదురంతకార్యములు, కామవికారప్రక్రియలు, చదివితీరవలెను. ఇంత యేల ? ఆంధ్రపత్రికాదిపత్రికలచే బాగ త్తకెక్కిన నవల యిది. చక్కని నిగ్గు కాలికో బైండు, మంచి అచ్చు, మంచి కాగితము.

# రసపుత్రజీవనసంధ్య

గ్రంథకర్త:— భాగవతుల నృసింహశర్మ గారు.

బెంగాళీభాష యందు శ్రీ రమేశచంద్రదత్తు గారిచే వ్రాయఁబడినది పై గ్రంథకర్త గారిచే ననువదింపఁబడినది. ప్రథమప్రతులన్నియు సరిపోయినవి ద్వితీయముద్రణమునకు సిద్ధముగానున్నది. కలయువారు వెంటనే తెలియఁజేయవలెను వెల 0-14-0 పోస్టేజి ప్రత్యేకము.

నాటకత్రయము — గ్రంథకర్త — భా॥ నృ॥ శర్మ.

## 1 విజయ విజయము.

వీరరసప్రధానమగు నాటకము. కృష్ణార్జునుల యుద్ధము. ఎల్లరు భారతమం దిది వినవారే కాని కర్ణుఁడెట్టివాఁడో యెఱింగినవారు లేరు. కర్ణునికొఱకే యీనాటకము వ్రాయఁబడినది. అనేకులు కొనియాడిన నాటకమిది. వెల రు 0-10-0 పోస్టేజిప్రత్యేకం

## 2 ప్రతిజ్ఞావిజయరామరాజీయము
లేక
## విచిత్రవీరబొబ్బిలి.

బొబ్బిలియుద్ధనాటకము లనేకములున్నవి. యథార్థములగు నంశములతో విరాజిల్లు నాటకరత్నమిదియే. విజయరామరాజుగారి రాజనీతికి బొబ్బిలివారి పరాక్రమములకు నిది యునికిపట్టు. వెంగళ్రావు, రంగారావు, పాపయ్య, మొదలగు వీరుల పద్యము లగ్నిహోత్రమును వర్షించును. దీని వెల 0-12-0 పోస్టేజి ప్రత్యేకము. కొలదిప్రతులు మాత్రమే కలవు.

# ప్రతిజ్ఞాచాణక్యము.

శ్రీద్విజేంద్రలాల్ రాయ్ గారు వంగభాషయందు నాటకగ్రంథకర్తలలో నగ్రేసరుఁడని ప్రఖ్యాతి. ఆతఁడు వ్రాసిన నాటకములకు "చంద్రగుప్త" శిరోభూషణము. ఆ చంద్రగుప్త నాటకమే యీప్రతిజ్ఞాచాణక్యము. అనేక నాటకములవారు నాటకమాడి ప్రఖ్యాతిఁగాంచిరి. చాణక్యు నెఱుఁగఁ దలంచినవా రీనాటకముఁ జదివితీరవలెను. దేశభక్తి కిది పుట్టినిల్లు, చందాదార్లకు 0-12-0 ఇతరులకు రు 1-0-0 పోస్టేజి ప్రత్యేకము.

# అభినవభర్తృహరి.

గ్రంథకర్త:—భాగవతుల నృసింహశర్మగారు.

ఈనామముఁబట్టియే యిది భర్తృహరి సుభాషితములంబోలు గ్రంథమని తెలియఁగలదు. శృంగారాది వివిధరసములకు, నీతి భక్తి జ్ఞాన వైరాగ్యముల కిది పుట్టినిల్లు. మృదుమధురపద్యములు, చక్కని శైలి, మంచికాగితము, సొగసైన అచ్చు దిట్టమగు నట్టు బైండు. కొలఁది ప్రతులే యున్నవి. దీనివెల 0-10-0 పోస్టేజి ప్రత్యేకము.

# కామాక్షి సరసము.

గ్రంథకర్త—శృంగారశిరోమణి, మండా వెంకటేశముగారు.

తారాశశాంకవిజయము, బిల్హణీయము, రాధికాసాంత్వనము, మొదలగు శృంగారరసప్రబంధములకంటె నిది మేలు. ఉపదేశరూపమున శృంగారరసము గుప్పింపఁబడినది. నీతిబోధకము, మంచిఅచ్చు, మాడసొంపుగనుండును. మత్తేభమాలిక.

మనోహరశైలి వెల 0-1-0 మాత్రమే.

వెలస్వల్పము !! ఫలమధికము !!!

# పద్మరాగము.

(అద్భుతమైన నిరూపకము.)

గ్రంథకర్త:—బూర్లె వెంకటరమణయ్యగారు. ఆంగ్లేయమునఁగల "Reddle of the purple Emperor." అను నవల ననుసరించి స్వతంత్రముగ వ్రాసిన నవల యిది. పద్మరాగాద్యనర్ఘరత్నములకై జరిగిన యద్భుత సంఘటనములతో నిండియుండును. ప్రసిద్ధికెక్కిన డిటెక్టివ్ నవలలలో నిదియొకటి యని యెల్లరిచేఁ గొనియాడబడినది.

వెల చందాదారులకు రూ 1—0—0

# దుర్గాదాస్.

గ్రంథకర్త:—వారణాసి భానుమూర్తిగారు.

వంగభాషలో సుప్రసిద్ధులగు శ్రీయుత ద్విజేంద్రలాల్ రాయిగారి దుర్గాదాస్ నాటకమున కనువాదమిది. అత్యద్భుతవీరావేశము బుట్టించును. ఔరంగజేబు నల్లలలాడించిన గుల్నార్ నాయిక. వెల ఖర్చులతో సహా 1—0—0 మాత్రమే.

# మురళీధ్వని. (అనుబంధ గ్రంథము.)

గ్రంథకర్త:—శ్రీయుత పురిపండా అప్పలస్వామి గారు.

చక్కని భావకవిత్వమునకు దోవజూపు పద్యరత్నము లిందుగలవు. శైలి మృదుమధురము. వెల 0—4—0 మాత్రమే ఖర్చులు ప్రత్యేకము.

# చపల.

అత్యద్భుతకథాసంవిధానముం గల్గిన నిరూపకనవల.

గ్రంథకర్త:—పండిత ఆదిభట్ల తరణి ప్య సిద్ధాంతిగారు.

ఇట్టిది మనభాషయందు వెలువడి యుండబోదు. వంగీయపత్రికలన్నియు దీనిని బహుభంగులం బ్రశంసించినవి. ఇందు ముగ్గురు రహస్య పరిశోధకులు, మువ్వురు నాయకులు, మువ్వురు నాయికలు, మూడస్త్రములు, ముమ్మారు ప్రయోగము, మూడు హత్యలు, మూడు పలాయనములు, మూడు మూసజాబులు, మూడు హింసలు, మూడు ప్రవృత్తులు, మూడు పూర్వవృత్తాంతములు, నవనీత కోమలాంగియగు మ్లేచ్ఛస్త్రీ చాంద్బీబి గావించిన పైశాచికకృత్యములు, నరరాక్షసుడగు శశిభూషణుని దుర్దాంత వ్యాపారములు, వలచిన కాంతను నిరాకరించుట, ఒల్లని యబలను బలాత్కరించి వివాహమాడుట, పెండ్లిలో బెద్దపెండ్లి, నిద్రలో దీర్ఘనిద్ర; క్రొత్తపెండ్లికూతురు మగనిం జంపినట్లు నిర్ధారణ, వింత దొంగతనము, దొంగనోట్లను సృష్టించుట, అబల దాసియగుట, మనుజుండు రాక్షసుడగుట, అనుమానము, పెనుభూతము, మోసము, అవిశ్వాసము, భ్రమ, పరాధరము, దంభము, వేషము, హెచ్చరిక, మొదలగు విషయములతో నిండియుండును. దీనిని జదువనారంభించినంతనే, ముగించువరకు నిద్రాహారములందభిరుచి యుండదు. గ్రంథము నీతిబోధకము ఉద్వేగ పరిపూర్ణము, కౌతూహలాక్రాంతము, పాపవ్యక్తీకరణము, పాపవిపాకసమాప్తము. శైలి సులలితము సలక్షణము. దీనివెల చందాదారులకు రు 1—0—0 ఇతరులకు రు. 1—8—0 ఖర్చులతో సహా.

# శృంగారసంధ్య.

(గద్యపద్యాన్వితము)

గ్రంథకర్త:—భాగవతుల నృసింహశర్మగారు.

సంధ్యాదేవి సౌందర్య శృంగారము—సతీ శివుల పవిత్రశృంగారము—రతీ మన్మథుల సరసశృంగారము—రోహిణీ చంద్రుల ప్రేమాభిరామశృంగారము—బ్రహ్మాది ప్రజాపతుల విభ్రమశృంగారము—మన్మథుని ప్రగల్భవాక్య శృంగారము—వసిష్ఠుని యనురాగగర్భితవాక్య శృంగారము—శృంగారములో వియోగము—ప్రణయము—వసంత గ్రీష్మవర్షాది ఋతువర్ణనలు—నద నదీ పర్వత సరోవరాది వర్ణనలు గల గ్రంథరాజ మిది. కాళికాపురాణాంతర్గతము - వ్యాస ప్రోక్తము. విలువ రు1-0-0.

# విషమరహస్యము.

రహస్య పరిశోధకనవల.

గ్రంథకర్త:—వారణాసి భానుమూర్తిగారు.

అత్యద్భుత కథాసంవిధానము గలిగి, నిగూఢరహస్యముచే "పదచిహ్నానుసరణ" మను చిత్రపటముతో చక్కని అచ్చుతో నలరారుచున్నది. ఇందుగుండె లవియజేయు హంతకుని చేష్టలును, హత్యాన్వేషణమునకై సర్వవిజయుని పన్నుగడలును చదువదగినవి. అడుగడుగునకును స్తంభీభూతత్వమును విభ్రమమును గలుగజేయుచుండును. ఇందు నాయిక పవిత్రప్రేమ, మిత్రకృతజ్ఞత, ఆత్మత్యాగము, పాపాచరణమునకుం దగిన ప్రతిఫలము, పురుషుని మించిన స్త్రీ సమయస్ఫూర్తిజ్ఞానము మున్నగు విషయములు తప్పక చదివితీరవలెను. విలువ రూ 1—0—0 మాత్రమే.

# వైకుంఠమతము.

చిన్న నిరూపకనవల.

నాగరికత పేర జరుగుచున్న ప్రస్తుత సాంఘికదురాచారముల కిదొక్కటి యంజనమై దోచును. అందఱును చదువందగినది. వెల రు 0—8—0.